ప్రథమ ముద్రణము
1,000 ప్రతులు.

సుప్రసిద్ధ
పాశ్చాత్య నవలా రచయిత
విక్టరు హ్యూగో
**Les Miserables**
అనే నవలకు
సంక్షిప్తానువాదము.

ప్రకాశకులు :
వి. దుర్గాప్రసాదరావు ఎమ్.యస్.సి.,
గొడుగుపేట—బందరు.

# ౧వ ప్రకరణము

1815వ సం॥లో, ఎం. ఛార్లెస్ ఫ్రాంకో బీన్‌వేను మిరియల్, డే—— పురంబిషప్పుగా ఉండేవాడు. 1806వ సం॥నుంచీ అతనక్కడ అధికారంలో ఉన్నాడు. ఈక్రింది వివరణాలు చరిత్రకు ఏవన్నీ తేలేకున్నా, అనుప యుక్తాలు కావు. ఏమంటే ఒక వ్యక్తినిగూర్చి, ఆనాటి జనపథంలో ఉన్న వదంతులు నిజమైనా కాకున్నా, ఆవ్యక్తి జీవితానికీ పురోగమనానికీ చాలా సంబంధం కలిగిఉంటాయి. మిరియల్ తండ్రి ఐక్సు పార్లమెంటులో కౌన్సిలరు. తనత్రోవనే కుమారుని పోనీ దలచి, తండ్రి, అతని కిరువది దాటకుండానే వివాహాన్ని చేశాడు. వివాహానంతరంకూడా మిరియల్‌లో యౌవనపు చిలిపితనం పోయినట్లు తోచదు. పొట్టిమనిషైనా, మిరియల్ దృఢకాయుడు, స్ఫురద్రూపి, విలాసమూర్తి, పలుకునేర్పరి. యౌవనంలో అతను ఫక్తు శృంగారపురుషుడు.

ఫ్రెంచివిప్లవం వచ్చింది. పార్లమెంటరీ కుటుంబాలు విచ్ఛిన్నమై మాన ప్రాణ రక్షణంకోసం పారిపోయాయి. ఆ రోజుల్లో మిరియల్ ఇటలీపారిపోయాడు. అతనిభార్యా గుండెజబ్బుతో అక్కడ చనిపోయింది. మిరియల్ భవిష్యత్తేమైంది ? తన పురాతన ఫ్రెంచి సంఘవిచ్ఛిన్నం, తనకుటుంబవినాశనం, కన్నవాళ్ళకన్న విన్నవాళ్ళకెక్కువ భయంకరములైన 1793 దురంతములు, అన్నీకలిసి అతణ్ణి విరాగిగాను ఏకాంతవాసిగానూ చేసివేశాయి. సామాన్య భౌతికావస్థలను లెక్కచేయని వాళ్ళనిగూడా, హృదయాల్లో దారుణాఘాత మొనర్చి చిత్తుచేసే ఒక అగమ్యమూ భీకరమైనశక్తి అతణ్ణి డీకొన్నదేమో? ఇటలీనుండి మరలివచ్చేనాటి కతనొక ప్రీస్టు.

ఒక సన్నివేశంలో నెపోలియన్ చక్రవర్తి అతనితో ప్రీతుడయ్యాడు. అనతికాలంలో, మిరియల్ బిషప్పు పదవినంది విస్మితుడయ్యాడు.

* * *

మిరియల్ పూర్వచారిత్ర యెవ్వరికీ సరిగా తెలియదు. చిన్నపట్టణాల్లో చాలామందికి తలబరువుకన్న, నాలికజోరెక్కువ. అల్లాంటిచోట్ల, ప్రతి ఆగంతకుడు పడవలసిన పాట్లన్నీ మిరియల్ పడ్డాడు. అందులో బిషప్పు. అతను వదంతులబారి పడకేల్లా! పదిసంవత్సరాల్లో బిషప్పునుగూర్చి చెప్పుకున్న విషయాలన్నీ, కథలుగా కట్టుకథలుగా, వదంతులుగా, నట్టి

మాటలుగా, నామమాత్రావశిష్టాలుగా, అవశిష్టరహితాలుగా అయిపోయాయి. ఆతరువాత ఆవిషయాల నెత్త సాహసించిన వారుగాని జ్ఞప్తిపెట్టుకున్న వారుగానిలేరు.

మిరియల్, డే— వచ్చేటప్పటి కతనితో అతని చెల్లెలు, మిస్లీబాప్టిస్టీన్ అతనితో వచ్చింది. ఆమె అతనికన్న పదేళ్ళు చిన్న. బ్రహ్మచారిణి. వాళ్ళింట్లో దాసీపనికి మేగ్లోయిర్ అనే స్త్రీ ఉండేది. అతని చెల్లెలికి చెలికత్తెగా ఉంటూ మేగ్లోయిర్ గృహకృత్యాలన్నీ నివర్తించేది.

ఆప్రాదురాగానే మిరియల్కు బిషప్పులుండే పెద్దమందిరంలో నివాసమేర్పరిచారు. మేయర్ మొదలైన ఊరి పెద్దలు వారి దర్శనానికి వచ్చారు. ఈ పరామర్శలై బిషప్పుగారికి స్థావరం చిక్కినతర్వాత, ఈ క్రొత్త బిషప్పుగారేమి చేయగలరో చూద్దామని ఊరువారు ఎదురుచూశారు.

బిషప్పు మందిరము ప్రక్కనే ఒకచిన్న ఆస్పత్రి వుండేది. చాలా చిన్నదిగా ఉండటంవల్ల రోగులకు స్థలంచాలక అక్కడ చాలా యిబ్బందిగా వుండేది. ఒకనాడు బిషప్పు ఆ ఆస్పత్రికి వెళ్ళాడు. మరునాటికి బిషప్పుగారి పెద్దమందిరం ఆస్పత్రిగాను ఆస్పత్రి బిషప్పుగారి యిల్లుగాను మారినాయి. మిరియల్కు వేరే ఆస్తిఏమీలేదు. చెల్లెలికి సాలీనా 500ఫ్రాంకులు వచ్చేవి. అతనికి బిషప్పుగా సాలుకు 15 వేల ఫ్రాంకులు సర్కారుజీతము. ఆనాడే అతను తనజీతం యీ క్రిందిపద్ధతిగా ఖర్చుపెట్టటానికి ఏర్పరుచుకున్నాడు.

| | | |
|---|---|---|
| మతసంస్థలకు | 2150 | ఫ్రాంకులు |
| శిశుమాతృ సంరక్షణ సంస్థలకు | 350 | |
| జైళ్ళ అభివృద్ధికి | 400 | |
| ఖైదీలవిముక్తికి, సహాయానికి | 500 | |
| అప్పులపాలై జైళ్ళుపడ్డ సంసారులవిముక్తికి | 1000 | |
| జిల్లాలో బీదఉపాధ్యాయుల వేతనాభివృద్ధికి | 2000 | |
| కొండజిల్లాలలో ధాన్యపువిత్తులకు | 100 | |
| బీదబాలికల ఉచిత విద్యాలయాలు | 1500 | |
| బీదలకు | 6000 | |
| స్వంతఖర్చు | 1000 | |
| మొత్తం | 15000 | |

మిరియల్ జే—లో వున్నంతకాలం ఈపద్ధతిలో ఏమార్పూ కలుగలేదు. యీపద్ధతిని ఆత్మశిక్షణగా భావించుకొని అతను తనపై విధించుకున్నాడు. అతణ్ణి గురునిగాను, జ్యేష్టునిగాను చూచుకొనే అతని చెల్లెలు యీమార్పును చిరునవ్వుతో స్వీకరించింది. దాసీ మేగ్లోయిర్ కొంతగొణిగిందేమో?

*   *   *

తన పర్యటనంలో బిషప్పు చాలానాథుత్వం, విశాలహృదయం చూపేవాడు. అతను బోధకునిలా బోధచేయక ఎక్కువ యిష్టాగోష్టిలో హితవు గరపేవాడు. మనసుకు నచ్చేటట్లు తండ్రిలాగ నెమ్మదిగా వాళ్ళకు చెప్పేవాడు. అతనిమాట తిరు మతపవిత్రుల కుంటుందేమో! అతను నాటినవిత్తు ఊరికేపోలేదు.

బిషప్పుమాటలు మృదువుగా జీవం ఉట్టిపడుతూ ఉండేవి. అతనినవ్వుకు పసిపిల్లల నవ్వేసాటి. ఒక్కొక్కప్పుడు అతను చల్లచల్లగా మందలిస్తూండేవాడు. ఆఊళ్ళో ఒకనాటొక చిన్నక్రీస్తు దాతృత్వాన్నిగురించి అతిఉద్రేకంతో ఒక ఉపన్యాసమిచ్చి స్వర్గనరకాలను రెంటినీ వాళ్ళకళ్ళముందు కట్టాడు. దానితో జనంలో దాతృత్వబుద్ధి ఒక్కసారిగా మిన్నంటిపోయింది. పల్లెకబిచ్చంపెట్టని ఒకకోటీశ్వరుడు ఈ ఉపన్యాసంవిని దోవలో ఒకబిచ్చగాడిజోలిలో ఒక కానీ వేశాడు. బిషప్పునవ్వుతూ "గెబొరాండ్ ఒక కానీ స్వర్గంకొంటున్నాడు. చూడు" అని చెల్లెలికి చూపించాడు.

ఆయా ఊళ్ళు తిరుగుతూన్నప్పుడు అతనా ఊళ్ళజనంతో వాళ్ళమాటయాస అలవరచుకొని వాళ్ళల్లోవాడిలాగే మాటలాడేవాడు. అందువల్ల తేలికగా అతను వాళ్ళ హృదయాల్లో స్థానం ఆక్రమించుకో కలిగేవాడు. పెద్దకుపెద్ద చిన్నకుచిన్న, ధనికుడికి బీదకు సమంగావర్తించి, అతనందరి మన్ననకు పాత్రుడయేవాడు.

తొందరపడి అతనెవర్నీ నేరంకట్టేవాడుకాడు. పరిస్థితులన్నీ పరిశీలించనిదే అతనెవర్నీ ఖండించలేదు. ఎందుచేత అతడా పాపంచేశాడోచూద్దాం! నేనుమాత్రంపూర్వం అమితపాపిని కాదా......

మానవుడిదేహం కోరికలపుట్ట. అతనితలపై బరువు. ఈదేహాన్ని మోసుకుపోతూ, అతనీదేహానికి లొంగిపోతాడు. తుది దాకా అతను దేహానికి లొంగకూడదు. అలా లొంగిపోవటం

తప్పే అవవచ్చును. కాని ఆపాపం దైహికం. అతనిలో పతనం ఉండవచ్చు. కాని ఆపతనంలో అతను మోకరిస్తాడు. తుది ప్రార్థనలో ఆపాపం పరిహారమవుతుంది. మహాయోగి అవటం అరుదే. కాని ధర్మాచరణం సామాన్యమవాలి. పౌరవుడు, తప్పుచెయ్యి, పాపంచెయ్యి, కాని న్యాయంగా ఉండటానికి ప్రయత్నించు. సాధ్యమైనంతవరకు 'పాపం' తగ్గించుకోటం మనుష్యన్యాయం. అఘరాహిత్యం దేవతలకేస్వాప్నం. భౌతికమైన దానికల్లా పాపాచరణం తప్పదు. భూమికిలాగే పాపానికూడా ఆకర్షణశక్తి వుంది.

సంఘబలంవల్ల క్రుంగిపోయిన స్త్రీలను, బీదలను, అతను లాలించేవాడు. "స్త్రీ, శిశు, దాసీ, అశక్త, పేద, మూఢ, జనులు చేసే పాపాలు వారివికావు. భర్తృ, పితృ, యజమాన బల వర్ధనిక, విద్వజ్జనాలు వరుసగా వారిపాపాలకు బాధ్యులు. అదీకాక సాధ్యమైనంతవరకు అజ్ఞానులను జ్ఞానవంతుల్నిగా చేయండి. ఉచితప్రబోధ మొనర్చనందుకూ, అందువైగలిగే అజ్ఞాన తిమిరానికి సంఘమే బాధ్యురాలు. ఆత్మను చీకటులలుముకున్నాయి. అందుచేతనే పాపము కలుగుతూంది. అందువలన పాపఫలం పాపంచేసే అజ్ఞానిదికాదు. అతనికి ప్రబోధ మొనర్పక ఆచీకటులు కమ్మనిచ్చిన జ్ఞానిది."

ప్రతివిషయంలోను అతనిదృష్టి వింతగాఉండేది. కొందరు పెద్దలు ఆరోజులలో జరిగిన ఒక నేరాన్నిగురించి చెప్పుకొంటూండగా అతనక్కడఉన్నాడు. భార్యా బిడ్డలకోసం ఒక దరిద్రుడు, చేసేదిలేక— దొంగనాణాలు సృష్టించాడు. ఆ

రోజుల్లో ఆనేరానికి మరణశిక్ష. అతనిభార్య మొదటినాకెం మాడుస్తుండగానే పోలీసులు పట్టుకున్నారు. కాని ఆమెమీద నేరం ఋజువుకాదు ఆమె ఒప్పుకుంటేతప్ప. ఆమె ప్రియుడి మీద నేరంలేదు. ఆవిడ యేమీ ఎరగనంది. మేజస్ట్రీటు తెలివైనవాడు. ఒకఉపాయం కనిపెట్టాడు. ఆమెప్రియుడు వేరొకస్త్రీకి ఉత్తరాలు వ్రాసినట్లుగా లేఖలుసృష్టించి భర్త ఆమెను మోసం జేస్తున్నట్లు నచ్చచెప్పాడు. అసూయవల్ల ఆమెకు ఒళ్ళు తెలియలేదు. చివరకంతా ఒప్పుకొంది. తన ప్రియుడిదే నేరమని నిందించింది ఈకథవిని అక్కడఅందరూ మేజస్ట్రీటు తెలివికి సంతోషించారు. బిషప్పు కథంతా నిశ్శబ్దంగావిని " ఆభార్యాభర్తల నెక్కడవిచారిస్తారు." అని అడిగాడు.

" *ఎసైజెస్‌లో"

"మేజస్ట్రీటుగారి నెక్కడ" విచారిస్తారు ?

ఒక్కసారి డేలో హత్యానేరంపై ఒకడికి ఉరిశిక్ష విధించారు. ఉరికి పూర్వం క్రీస్తు నేరస్థుడి పక్కనుండి అతని తుది సంధ్యలో, అతన్ని దైవసాన్నిధ్యాన్ని చేర్చటానికి మతబోధ చెయ్యాలి. జైలుప్రీస్టుకు జబ్బుచేసింది. †క్యూరీని వెళ్లమంటే "అది నాపనిగా" దన్నాడు.

---

*Assizes అంటే సెషన్సులాంటిది.

† క్యూరీ అంటే బిషప్పుకింది అధికారి, ప్రీస్టుకు పైఅధికారి.

ఆమాటవిని బిషప్పువెంటనే ఖైదీదగ్గరకు వెళ్ళాడు. ఆ పగలు రాత్రి అతనితో గడిపాడు. అతిసులభంగా మహాసత్యాలు అతనికిచెప్పాడు. అతనికుపశమనమిస్తూ ప్రతివిషయం అతనికి నేర్పాడు. అతను నిస్పృహతో,నిరాశతో మహాభీతుడైఉన్నాడు. మృతిఅంటే అగాధమైన లోయగా కనపడింది. ఆగోతి అంచులనిలబడి అతను ఒణికిపోతున్నాడు. జీవితానికి మృతికి ఉన్నఅడ్డు పగుళ్ళలోనుంచి చూశాడు. కటికచీకటి. ఆ అగమ్యంలో బిషప్పతనికొక వెలుగుచూపించాడు. అంతవరకూ కుములుతూన్న ఆ నేరస్థుడు సంతోషంతో ఉరికంబమెక్కాడు. బిషప్పతన్ని కౌగలించుకొని కత్తికంఠంమీద పడబోయేముందు అతనితో అన్నాడు. "తమ్ముడా ఏమానవునితోడి మానవులు చంపుతారో దైవమతన్ని పునరుద్ధరిస్తాడు. సోదరులచే తరిమివేయబడతాడు—తండ్రి పంచను చేరుకుంటాడు. అదుగో తండ్రి! తమ్ముడా! నవజీవవితంలో ప్రవేశించు"

బిషప్పు క్రిందికి దిగివచ్చినపు డతని కళ్ళల్లో ఏదోచూసి జనం అతనికి త్రోవ తొలిగారు. అతనిముఖంలో పాండురమో, ప్రశాంతమో ఏది అద్భుతంగాఉందో చెప్పటం కష్టం. ఇదంతా నటనన్నవారు లేక పోలేదు. కాని అల్లాటివాళ్ళు ధనికప్రపంచంలోనే.

రోగుల దగ్గిగకు, మృత్యుముఖానున్న వాళ్ళదగ్గరకు మిరియల్ కబురక్కర లేకుండా తక్కిన పనులన్నీ అవతలబెట్టి వచ్చేశేవాడు. భార్యను గోల్పోయిన భర్తవద్ద, బిడ్డను గోల్పోయిన తల్లివద్ద గంటలకొద్దీ నిశ్శబ్దంగా కూర్చోటంలో

అతను నేర్పరి. ఎప్పుడు మాట్లాడకూడదో ఎప్పుడు పలకాలో అతనికి బాగా తెలుసును. అతని ఔదార్యపద్ధతి —దుఃఖాన్ని మరచిపొమ్మని అతనేనాడు చెప్పలేదు. కాని జీవితంలో ఆశనుచూపించి, ఈకష్టాని కౌన్నత్యం ఇచ్చేవాడు. మృతుల విషయంలో నశ్వరమైన దాన్నిగూర్చి తలవద్దు దీక్షగా చూడు. నీ పేరిమనుగూర్చి ఆత్మజ్యోతి ఎదురుగా స్వర్గంలో నీకు కనబడుతుంది.

నమ్మకంలో శక్తీ, ఆరోగ్యమూ ఉన్నాయని అతనికి తెలుసు దుఃఖంతో నిరాశుడైనవానికి కష్టాల్లో తలగడిగిన కర్మయోగిని చూపించేవాడు. శ్మశానం చూడగానచ్చిన విచారాన్ని నక్షత్ర దర్శనంలోఉన్న విషాదంతో తిప్పేసేవాడు.

మిరియల్ జీవనం చాలా నిరాడంబరంగా ఉండేది. అతను తనకుగా తాను అనుభవించే దారిద్ర్యం చూస్తే ఎవరైనా విస్మయంతో ముగ్ధులైపోతారు. అతను అందరు మేధావుల లాగే కొద్దికాలమే నిద్రపోయేవాడు. ప్రొద్దున్న ఒకగంట సేపు సమాధిలోఉండి, తర్వాత ఇంటిదగ్గరైనా, దేవాలయంలోనైనా గీతాపఠనం చేసేవాడు. ఆతరువాత జొన్నరొట్టె, తనఇంటి ఆవుపాలు పుచ్చుకునేవాడు.

బిషప్పుకు సర్వసాధారణంగా పనులు చాలాఉంటాయి. అతని క్రిందిజిల్లాలో మతసంస్థలు చాలాఉంటాయి. అవన్నీ తనిఖీలు చెయ్యాలి. ఇటు మతవిషయాలు అటు రాజకీయాలు కూడా జాగ్రత్తగా సమర్థించుకొంటూ రావాలి. ఇన్నిపను

లకు పైగా అతను నీవపాదల దగ్గరకు రోగులదగ్గరకు నిత్యము వెడుతూండేవాడు. సాయంత్రింపూట తోటలో పనిచేసేవాడు. లేకుంటే చదువుకొనేవాడు రెండుపనులూ ఒకటేఅని అతని ఊహ. ఒకటి నేల పదునుచేయటం ఒకటి మనస్సు పదునుకు తేవటం.

బిషప్పుగారి బండి దానధర్మాలకు మారిపోయింది. కాబట్టి కాలినడకచే బిషప్పు జిల్లాఅంతా తిరిగేవాడు.

మధ్యాహ్నాహారానంతరం, ఎండబాగాఉంటే దగ్గరఉన్న ఊళ్ళకు పోయి, ఇల్లిల్లుచేరి వాళ్ళను పరామర్శించుతూ కులాసాగాకబుర్లు చెప్పేవాడు. అతనువెళ్ళినచోటల్లా ఆనందం తాండవమాడు తూండేది. సర్వమంగళాలు అతనివెంట నడిచి వస్తున్నట్లుం డేవి. తోవలో చిన్నపిల్లలు కనబడితే అతనికీ వాళ్ళకీకూడా పండుగ. పైసలతో నిండుగాబయలుదేరిన జేబులు అతనింటికి కొచ్చేటప్పటికి 'సొంఱు' కొనేవి. లోపల చినిగినచొక్కాలు కనబడకుండా పేపవిలోనైనా ఆకోటలాగే తొడుక్కునేవాడు. ఏ విషయాన్నిగూర్చి చదువుతూన్నా అతనిబుద్ధి వేదాంతి కంగా పోయేది. ఒక రాజకీయ గ్రంథంచదువుతూ అందులో అతనిలా వ్యాఖ్యవ్రాసుకొన్నాడు.

" ఓప్రభూ! నిన్నెవరవని అనాలి? కొందరునిన్ను సర్వాంత ర్యామిఅంటారు. కొందరు సృష్టికర్తవని—ఇంకొందరు స్వాతం త్ర్యమూర్తివని సంపూర్ణుడవని — సత్యముజ్ఞానమవని— జ్యోతివని —ఇంకొకరు "విధి"వని- ఒకచో సుచిమూర్తివని.

మూడుమైళ్ళ దూరాన రాబందులా నివసిస్తున్న అతని కుటీరం దూరంనుంచి చూసి బిషప్పు "నే నక్కడి కొకసారి వెళ్ళవలసిన విధి ఉన్నది" అనుకొంటూండేవాడు. కాని నిజంచెప్పాలిసొస్తే అతనికీ ఎందుకో అక్కడికి వెళ్ళటానికి మనస్సుకు కష్టంగావుండేది. తక్కిన జనంతోపాటుగా ఈ కన్వెన్షలిస్టుని అతను ఎందుకో తెలియని ద్వేషంతో చూసేవాడు.

ఒకనాడు ఆకన్వెన్షనలిస్టు పక్షవాతంతో చనిపోటానికి సిద్ధంగా ఉన్నాడని ఊళ్ళో కబురు తెలిసింది. బిషప్పిక ఆలస్యం చేయకూడ దనుకొని బయలుదేరి అపరాహ్ణానికి అతని గుడిసె చేరుకున్నాడు. తలముగ్గిన వృద్ధుడొకడు ఒక వాలుకుర్చీలో పడుకొని సూర్యరశ్మిలో కాగుతున్నాడు. చిన్నకుర్రాడొక డతనికి గ్లాసులో పాలందిస్తున్నాడు. వృద్ధుని మొగంలో మందహాసం చిందుతూంది. "చాలునాన్నా" అని కుర్రవాణ్ణి లోపలకు పంపాడు. బిషప్పు ముందుకుసాగి అతని దృష్టి పథంలోకివచ్చాడు.

వృద్ధు డాశ్చర్యంతో అతనివంకతిరిగి నేనిక్కడకు వచ్చిన తర్వాత మీరే మొదటిఅతిథులు. అయ్యా! తమనామధే యం?" అన్నాడు.

"బీన్ వేను మిరియల్"

"తమకి నేనూ జనమిత్రులని కొనియాడుతారు"

"నన్నే"

వృద్ధుడు చిరునవ్వుతో "అయితేమీరు నాబిషప్పులన్న మాట" అన్నాడు.

"ఒకమాదిరిగా"

"అయ్యా దయచేయండి:"

అతను చేయందీయగా బిషప్పు స్వీకరించక "మీ కెక్కువ జబ్బుగాలేనందుకు మిక్కిలిసంతోషం" అన్నాడు.

"నాజబ్బు త్వరలోనే కుదురుతుంది" అని కొంతఆగి "ఇక మూడు గంటలలోగా నేను మరణిస్తాను. నాకుకొద్దిగా వైద్యము తెలుసును. నిన్న నాపాదాలు చల్లబడ్డాయి. పొద్దున్న మోకాళ్ళవరకు కొయ్యబారింది. ఇప్పుడు నడుం చల్లబడుతోంది. తుదిసారి ప్రపంచం చూడటానికి బైటికి వచ్చాను. నేనుపోయే సమయానికి చీకటిపడుతుంది. మృత్యువు పగలేనని నియామకంలేదు. చుక్కలుమిన్నుకై నాచాలు" అంటూ బాలుణ్ణి లోపలకు పంపేశాడు, "వాడు సుఖనిద్రపోతోంటే నేను దీర్ఘనిద్రపోతాను. ఒకనిద్రకొకనిద్ర తోడు."

బిషప్పుకి ఈఅంత్యం అంత మహత్తరంగా కనుపడలేదు. ఎందుకో వచ్చినప్పటినుంచీ అతనిలో ఒకమాదిరి చిరాకు బయలుదేరింది. బిరుదాలకాశించని అతనికి, తనకిక్కడ తగిన గౌరవం జరగడంలేదని తోచింది. మొట్టమొదటిసారిగా అతనిలో కొంతకాఠిన్యం ప్రవేశించింది.

కన్వెన్షనలిస్టులో (వృద్ధుడు) మృత్యువాకిట నిలబడ్డవానివిషయం కనబడుతూంది. సామాన్య చట్టాలకు సామాన్యమైన ధర్మా

లకూ అతీతుడైన ఈవ్యక్తినిచూసి బిషప్పు విస్తుపోయాడు. దగ్గిరగా ఒకరాత్రిపైగూర్చుని కనీసం రాజహత్యకు మీ ఓటి య్యనందుకు మిమ్మభి నందిస్తున్నాను, అన్నాడు బిషప్పు, మందలిస్తూన్న స్వరంతో. చిరునవ్వులేకుండా అతను...

"నన్నభినందించ కండయ్యా! నేనా రాక్షసుడిమృతికి వోటిచ్చాను."

"మీభావం నాకు తెలియులేదు."

"ఆనరుడిలో రాచరిక గర్భితంగాఉన్న అజ్ఞానంఅనే రాక్షసుడి అంతానికి నేను ఓటిచ్చాను. జ్ఞానమే పాలించేశక్తి. మానవుడు జ్ఞానంచేతనే పాలింపబడాలి"

"అంతర్వాణి వల్లనున్నా—" అని బిషప్పుచేర్చాడు.

"రెండూఒకటే, మనలో స్వతహాఉన్న జ్ఞానసంచయమే అంతర్వాణి."

బిషప్పుకీభాష వింత. ఆశ్చర్యంగా వింటున్నాడు.

లూయీ XVIని చంపడానికి నేనుకాదన్నాను. నాటి మానవుణ్ణి చంపటానికి నాకుహక్కున్నదని నేనునమ్మను. కాని ఒక రాక్షసుణ్ణి నిర్మూలించటం నాధర్మమని నేభావిస్తాను. అందుచేతనే నాఓటిచ్చాను. నాఓటంటే పశుప్రవృత్తికంతము. మానవదాస్యానికి తుదిమాట. చిన్నలకు ప్రభాతము. ప్రజాస్వామ్యానికి నాఓటిచ్చినప్పుడు పిటన్నిటికీ నాఓటు. సంఘ

భాతృత్వానికి, సంఘ ఐక్యానికి, నవయుగోదయానికి, నా ఓటిచ్చాను. తప్పులను, మూఢనమ్మకాలను, తొలగించటంలో, నేను సాయంచేశాను. ఆనిర్మాలం నూతనజ్యోతిని ప్రసరింప చేస్తుంది. పాతప్రపంచా న్నధోలోకాలకు దొర్లించిపారేశాం. విషపూరితమైన ఆపాత్ర మానవజాతిపై ఒలికి అమృతమయంగా మారింది."

"మిశ్రిత సంతోషం."

"ఆసంతోషాన్ని మీరుమిశ్రితమన్నారే 1814లో తిరుగబడ్డ ఈ పాపకాలాల్లో క్షణికమన్నారే. ప్చ! మాకార్యం అసంపూర్ణమన్న మాటనిజమే. పూర్వ సామ్రాజ్యాన్ని కృత్యాల్లో పడగొట్టాము. కాని పురాణభావ సముదయాన్ని అణచలేకపోయాము. దుష్కృత్యాలని నాశనం చేస్తేచాలదు. దుర్బుద్ధుల్ని గూడా మార్చాలి."

"విలయం ఉపయోగకరమవచ్చు. కాని ఉద్రేకంతో కూడు కొన్న నిర్మూలాల్ని నేనునమ్మను.

"బిషప్పుగారూ, న్యాయానికీ ఉద్రేకమున్నది. ఆ ఉద్రేకమే పురోగమనానికి చిహ్నం. ఎవరేమన్నారే! క్రీస్తు వెళ్ళింతర్వాతకల్లా, ఫ్రెంచివిప్లవం మానవ జాత్యుద్ధరణలో గొప్ప అంగ. ఆవిప్లవం అసంపూర్తి కావచ్చును. కాని అది మహోత్తేజితం. హృదయాలని మార్దవమొనర్చి శాంతి, తృప్తి, ఇచ్చి, విజ్ఞానవంతులుగా చేసింది. ప్రపంచంలో నాగరికత

వ్యాపింపచేసింది. ఈవిప్లవం ఉత్తమోత్తమం. ఎందుకంటే అవిజాతికుపాకర్మ."

బిషప్పు గొంతుగకుండా ఆగలేకపోయాడు. "ఉహూ!...... 179క డో?"

అతను లేవగలిగినంత ముందుకు లేచి, చనిపోయేవాడి కొక్కడికే రాగల శక్తితో అరిచాడు.

"ఆ! వచ్చారూ! ఆ మాటకోసమే ఇందాకటినుంచి చూస్తున్నా. పదిహేనువందల సంవత్సరాలుగా కాలమేఘం ఆవరించుకొని పెరిగిపెద్దదై, ఫెళఫెళామని విరిగిపడింది. ఉరుములనా ఖండిస్తున్నారు?"

ఆ [illegible] బిషప్పుమనసుకు నాటింది. కాని బింకతో సాగించాడు.

"[illegible] గిన ఉత్తమన్యాయం, కరుణ" అని కన్వెన్షనలిస్టువంక తీవ్రంగా చూస్తూ...

"లూయీ XVII మాటేమిటి" అన్నాడు.

"లూయీ XVII... సరిగ్గా ఆలోచిద్దాం. ఎవరికోసం మీ విచారం? అమాయకుడైన బాలుడి కోసమా? నేను కూడా మీతో కన్నీరు కారుస్తాను. రాజపుత్రుడనా? అక్కడమాత్రం సన్నొదిలివేయండి. నాకు, కార్టూషీ తమ్ముడై సంత మాత్రంచేత, చంకలకు తాళ్ళుకట్టబడి, చచ్చేదాక

వేళ్లాడతీయబడ్డ కాస్ట్రూషీ తమ్ముడి మరణం, లూయీ XV మనుమడైనంత మాత్రాన్న చంపబడ్డ లూయీ XVII మర ణంకంటె, క్రూరత్వంలో ఏమాత్రం తక్కువనిపించదు."
"ఆ పేర్ల సమ్మేళనం నాకు నచ్చదు."

"ఎవరి పేర్లు?— లూయీపదిహేడా? కాస్ట్రూషా? ఎవరి పక్షా న్నబోబూ మీ అభ్యంతరం?"

నిమిష కాలం నిశ్శబ్దం. బిషప్పు ఎందుకు వచ్చానా అనుకొ న్నాడు. కాని అతనిలో వింతపరివర్తన కలుగుతూంది. వృద్ధుడు మళ్ళీ సాగించాడు.

"బిషప్పుగారూ, కఠినసత్యాలు మీకొప్పుకోరు. కాని మీ ఏసుక్రీస్తు? దేవాలయాన్ని కొరడాలతో తుడిచేశాడే! అతని ఆమెరుపుల చెళుకు మహాకష్టంతోచే నిజాల్ని ఒలిచి పెట్టిందే! పసిపిల్లల్ని నాదగ్గిరకు రానియ్యండన్నప్పు డాయన యెట్టిభేదం చూపించలేదే! బానిసకొడుక్కి ప్రభుకుమారుడికీ తేడా యెరుగడే! అమాయకత్వం దానికదే కిరీటం. అదిధరించ టానికి జన్మాత్సుక్య మక్కరలేదు."

'నిజమే' అన్నాడు బిషప్పు హీనస్వరంతో.

"లూయీ 17 పేరెత్తారు. ఒకళ్ళనొకళ్ళు బాగా అర్థంజేసు కుందాం. వర్గ వివక్షతలేకుండా అమాయకంగా ఉరిబడ్డ పెద్దలు, పాపలు అందరికోసం కన్నీరు పెడదామా? ఊ! కానీండి నేనూమీతోపాటే. ప్రజలబిడ్డలకోసం నాతోపాటుగా కన్నీరు

కార్చండి ప్రభుల నిసువులకోసం మీతోపాటు విచారిస్తాను."
"నా కన్నీరు అందరికోసం"

"సమత్వంగా—తాసు మొగ్గితే ప్రజలవైపే మొగ్గనీయండి. ఎక్కువ అనుభవించింది ప్రజ!"

మరల నిశ్శబ్దం. ప్రజావాది మళ్లీ మొదలుపెట్టాడు. ఆరిపోయే జ్యోతిలాగా అతనిశక్తంతా అతనిలో తాండవిస్తోంది.

ఔనండీ ప్రజలెక్కువకాలం దుఃఖము, కష్టమూ అనుభవించారు. కాని లూయీ పదిహేడునుగూర్చి అడిగేటందుకు యెందుకుబాబూ మీరిక్కడికొచ్చారు. నేనిక్కడ నివాసం వచ్చినతర్వాత ఒక్కపురుగైనా — ఈ కుఱ్ఱాడుతప్ప — నావాకిట్లో కాలుపెట్టలేదు ... మీపేరు నేవిన్నాను ... జనం మిమ్మల్ని ప్రేమతో చెప్పుకుంటారు. కాని తెలివైనవాళ్ళకి జనవశీకరణశక్తులు చాలాఉంటాయి. మీబండిచప్పుడు నేవినలేదు. దూరాన దిగవిడిచి వచ్చిఉంటారు... మిమ్మల్ని నేనెరగనని చెబుతున్నాను. బిషప్పులన్నంతమాత్రాన మీనడత యెల్లాంటిదో నాకు తెలియదు. కానీ మళ్ళీ అడుగుతున్నా! ఎవరుమీరు?... బిషప్పులు. అంటే మతంలో సామ్రాట్టులు. సాలీనా 15,000 ఫ్రాంకులు నికరం, పైన 10,000, మొత్తం పాతికవేలురాబడి. వంటశాలలు, నౌకర్లు, చాకర్లు, ముందూ వెనుకా వేత్రధారులు, ఛత్రచామరాలు, కలిమి, సౌఖ్యం, అధికారం... సర్వం. బిషప్పంటే ఇది తెలియవచ్చు. కాని మీ నైతికాచరణం, మీహృదయవైశాల్యం, ఏమున్నా తెలు

స్తాయా? నాకు జ్ఞానోపదేశానికి వచ్చారే... యెవరువీరు?"
బిషప్పు తలవాల్చాడు. "నేనొక క్షుద్రకీటకాన్ని"

"అందలంలో క్షుద్రకీటకం" వృద్ధుడు కసిరాడు. అతనివంతు బిషప్పు వినయందాల్చాడు.

"సరే, కానీండి. కానీ, నాబండి, నాసౌఖ్యం, నావైభవం, కలిమి, అధికారాలు, — కరుణ సద్గుణంకాదని, క్షమ ధర్మంకాదని, 98 చర్యలు అవిధాయకం కావనీ ఎల్లా నిరూపిస్తాయి?"

రిపబ్లికన్ నుదురు చేతితో నిమురుకున్నాడు.

"నే జవాబుచెప్పకపూర్వం మీక్షమార్పణ కోరుతున్నాను. నాకుమీరు అతిథులు. మీవాదన నే ఖండించవచ్చును. మీ ఐశ్వర్యాదులవల్ల మీరు నాకులోకువే. కాని అతిథి ధర్మాన్ని నేనవి వాదనలో వాడకూడదు. క్షమించండి. ఈ పొరపాటు మళ్ళీజరుగదు.
"కృతజ్ఞుణ్ణి."

"మనవాదనలోకి వద్దాం ఎక్కడున్నాం. 98 ఎందుచేత తప్పదన్నారుకాదూ ..."

"ఔను 98 ఎల్లా విధాయకం? మీరట్ వధ్యశిలదగ్గర కరతాళాలు చేశాడే?"

'బొస్సూయే డాగ్రొనాడ్స్ మరణానికి సంగీతంతీశాడే?'

తుపాకి గుండుకన్న తీవ్రంగా తగిలిందిదెబ్బ, బిషప్పుకు.
బొస్సూ పేరీవిధంగా అతనెప్పుడూ తలచలేదు. ఈపేచీకి
తోడు కనపడలేదు.

హేతువాదానికి కరుణలేదు. మన మనస్సులలోని స్వర్ణ విగ్ర
హాలను తునకలు తునకలుగా కొట్టేస్తుంది.
కన్వెన్షనలిస్టుకు ఆయాసం హెచ్చయింది. అతని తుదిశ్వాస
లతో వగర్పు మిళితమయింది. కాని కళ్ళల్లో తేజం హెచ్చు
తోంది.

ఈ విషయంలో ఇంకాకొంచెం చెప్పుకుందాం. ఫ్రెంచి రివ
ల్యూషనుకు పూర్వపు చరిత్రానికంతకూ 97 ఒకజవాబు.
ఆవిషయానికొస్తే మహారాజుల రాజ్యమంతా ఏమిటి? కార్టి
యల్ దొంగే. కాని మాంట్రివిల్ కేం పేరెట్టగలవు? జార్జ్
రాక్షసుడే గాని మార్క్విస్ డీ లూవాయ్‌కి లొచ్చేనే? మేరీ
అంటొయినెట్ దుర్మరణానికై నేనుదుఃఖిస్తాను. కాని 1685లో
బీవర్ హ్యూగోనాట్ స్త్రీని బిడ్డకు పాలిస్తోంటే స్తంభానికికట్టేసి
నడుందాకా వలువలొలచి బిడ్డనుదూరాన్న పట్టుకునిలబడ్డారే.
పాలతో రొమ్ములు, ఆవేదనతో గుండెలు ఉబికిపోతున్నా
యి—బిడ్డఆకలితో శోషిల్లి, పాలరొమ్ము కనబడి, ఏడుపా
గక గుక్కపెడుతూంది. ఆ యిల్లాలితో, ఆ బిడ్డతల్లితో
"ఒప్పుకో" అంటాడు తలార్! అంటే, ఆత్మనన్నా చం
పుకో, లేక బిడ్డనన్నా చంపుకో అంటాడు. అయ్యా! ఈ
చిత్రవధ కేమంటారు? బాబూ! ఒక్కవిషయం మాత్రం
పదిలంగా జ్ఞప్తికి పెట్టుకోండి. ఫ్రెంచిరివల్యూషనుకు కార

కాలున్నాయి. దాని తీవ్రతకు అది తెచ్చిన భవిష్యత్తే పరిహారం. ఒక శ్రేష్టతరప్రపంచం, దానిఫలితం. దానిదారుణాఘాతాలలోనే మానవజాతికి ఉపశమనం మిళితమయి ఉంది. ఇంతటితో ఆగుతాను. జయంనాపక్షాన్న ఉన్నప్పుడు వాదించటం వ్యాగ్రాయం. అదీగాక నేను చనిపోతున్నాను."

బిషప్పువంక చూడకుండా ఆవృద్ధుడు శాంతంగా తన భావాల్ని ఇల్లాపూర్తి చేశాడు. "జాతి అభివృద్ధికై జరిగేదారుణాలనే విప్లవాలంటారు. ఆ విప్లవం అయిపోయాక కాని, జాతి విశిష్టమయినట్లూ, ముందుకు సాగినట్లూ కనబడదు."

బిషప్పు మనస్సులోని భావాలన్నీ పింజపింజగా ఏకబడ్డట్టు రిపబ్లిక నెరుగడు. బిషప్పు కొక్క సందేహం మాత్రం బాధిస్తోంది.

"అభివృద్ధి దైవంలో నమ్మాలి. ధర్మాని కధర్మాలు సేవకులుగా ఉండతగదు. చార్వాకులుజాతిని వక్రమార్గంలో పెడతారు."

వృద్ధుడు కొంతసేపు జవాబీయలేదు. అతను వణికి పోతున్నాడు. అతని కనుతుద నొక బాష్పకణం వుండి ఫాలిన చెక్కులమీద జారింది. తనలో తనకుగా రుద్ధకంఠంతో —

"ఓప్రభూ! లయానికతీతుడవు నీవొక్కడవే —"

బిషప్పుకులోపల ఏదో కలచివైచింది.

' — అంతములేని దొంకటుంపితిరింది. దానికి "నా" త్వము లేకుంటే "నేను" దానికసక్తి అవుతూన్నది. ఇంక అది అనంతము కాజాలదు. కాని అది అనంతము. అందుచేతనే దానికి "అహ" మున్నది. ఈ "అనంతము" యొక్క అహమే దైవము.'

అతను ఆవేగంతో ఒక మహిమాదృశ్యం వీక్షించిన ఆనందంతో ఈమాటలని, కళ్ళుమూశాడు. ఆవాక్కులు అతని శక్తంతా లాగేశాయి. తనకుమిగిలిన గంటల ఆయువు అతను నిముషాల్లో జీవించేస్తున్నాడు. ఉత్కృష్ట సమయం. బిషప్పు తనికి పార్థనసిద్ధామని వచ్చాడు. కాని, తనే ఉద్రేకపూరితుడయిపోయినాడు. అతనిచేయి తనచేతిలో పెట్టుకొని "దైవ ముహూర్తమిది. మనసంఘటన వృథాఅయితే చింతించరా' అన్నాడు.

వృగుడు ఆత్మగాంభీర్యంవల్ల కలిగిన మందస్వరంతో—

"బిషప్పుగారూ! నాజీవితం జ్ఞానతృష్ణలోనూ, తదభ్యాసంలోనూ గడిపాను. నాదేశం నన్నుపిలిచేటప్పటికి నాకరవై యేళ్ళు. తలొగ్గివెళ్ళాను. అత్యాచారాలతో పోరాడాను. రాక్షసత్వం నిర్మూలించాను. ధర్మాన్ని, నీతిని బహిరపరచి దానికి. కట్టుబడ్డాను. రాజ్యంపైకి దండువచ్చింది. ఫ్రాంసుకు హాని కలుగబోయింది. నాహోమ్ము అర్పించాను. నాకుడబ్బు లేదు. బీదను. కాని రాజ్యాంగముఖ్యులలో ఒకడను. కోశాగారాలు బంగారపుబరువుకు పగిలిపోతున్నాయి. కాని నేను

బీదహోటళ్ళలో అరాకన్న తక్కువకు భోజనంచేసేవాణ్ణి. పీడితునకు న్యాయంచేయటానికి పాటుపడ్డాను. బాధ నివారించాను. దేవివిగ్రహం చీరచించానా! నిజమే చించాను. కాని దేశం గాయాలకు కట్లుకట్టడానికి చించాను. వీలు కలిగినప్పుడల్లా శత్రువుల్ని, మీకులంవాళ్ళని రక్షించాను. '93లో ఒక చర్చి నాశనమవకుండా కాపాడాను. నాశక్తికొద్దీ నాధర్మం నెరవేర్చాను. ఇదంతా అయినతర్వాత నన్ను వెళ్ళగొట్టారు, తరిమారు. వెక్కిరించారు. హింసపెట్టారు. నన్నుగురించి అపవాదులువేశారు. నాపై రాళ్ళురువ్వారు. నాకజ్ఞాతం విధించారు. చాలాకాలం నన్ను నిరసించటానికి వాళ్ళకి హక్కుందనినమ్మాను. అమాయకప్రజ నేను ఘాతకుడని నమ్మారు. ఈవైషమ్యం విధాయకమనుకుంటూ స్వీకరించాను. ఈనాడు నాకెనభై ఆరేళ్ళు. మృతివాకిటనున్నాను. అయ్యా మీకునావల్లఏంకావాలి?"

"మీ ఆశీర్వచనం" అంటూబిషప్పు మోకరించాడు.

బిషప్పుమరల తలెత్తేటప్పటికి వృద్ధునివదనం శాంతితో నిండుకొంది.

బిషప్పు తీవ్రమైనఆలోచనతో ఇంటికి చేరుకొన్నాడు. ఆ రాత్రింతా ధ్యానంలోగడిపాడు. మరునాడు కన్వెన్షనలిస్టును గురించి అతనినడిగారు. అనుమానంతో వేలు పైకిచూపించాడు. ఆనాటినుంచి అతనిలో మార్దవం, కరుణ ఎక్కువయ్యాయి.

బిషప్పునుగూర్చి తుదిమాటొక్కటిచెప్పి వదిలేద్దాం. అతనిని వేదాంతిగా తలచవద్దు. అతని, సంపూర్ణము, విశాలము ఐన హృదయంలోనుంచి వచ్చిన వెలుగులే అతనిజ్ఞానం. తనొనర్చే నిత్యకృత్యాలే అతనికి సంహితలు.

" చింతన " కవధిలేదు. అందువల్లకల్లే సాలిగూడులోనే అది చిక్కిపోతూంటుంది. ప్రతిభాశాలుర కేవరికో ఆ వ్యూహపు టంచులు దోవయిస్తాయిట. వాళ్ళు దైవంతో సంభాషిస్తారట. బిషప్పు అల్లాంటి ప్రతిభాశాలికాడు. ఆ ఉత్తుంగ వీచీలహరు లలో అతను ప్రయాణం చేయలేదు. అబేదమానవుడికి ప్రేమించటం ఒకటే తెలుసును. అంతే. ప్రపంచం కష్ట భూయిష్టంగా కనబడేది. అతనందరి కోసం విచారించేవాడు. అందరికోసం ప్రార్థించేవాడు. జీవితసమస్యలను విడదీయటానికి ప్రయత్నించకుండా, బాధోపశమనం చేయటానికి ప్రయత్నించేవాడు. ఈ సత్పురుషుడుకి మానవజీవితం దుఃఖభూయిష్టం. దుఃఖోపశమనం అతని జీవిత పరమావధి.

బిషప్పు మానవజీవితంలో తెగని క్లిష్టసమస్యలకోసం, మనస్సు కలచుకోకుండా స్వీకరించి, వాటికవ్వల ఉన్న ఒక ఛాయను పూజిస్తూ జీవితం గడుపుకొన్న ఒక సామాన్య మానవుడు.

# ౨వ ప్రకరణము

1815 సం॥ అక్టోబరు మొదల్లో ఒకనాడు సాయంత్రం, ఘడియ పొద్దున్నదనగా ఒక పాంథుడు డె-పురం చేరాడు. సామాన్యపు పొడగరి, కండలుతీరిన ధృఢకాయుడు. నలువదిఆరు-ఎనిమిదేండ్ల వయస్సు, చెమటలుకారుతూన్న మొగాన్ని కొంత నెత్తిపై టోపీ కప్పివేసింది. పచ్చని కాలికో చొక్కా-లోనుంచి రోమాచ్ఛాదితమైన వక్షస్థలం కనబడుతూంది. ఒక మోకాలు చిరిగి, ఒక మోకాలు వద్ద అరిగిన నీలిషరాయి. వీపుమీద ఒక పెద్దనిండుసంచి. చేతిలో బలమైనముళ్ళకఱ్ఱ. పెరిగినగడ్డం. తల అంటకత్తిర వేసి ఉంది. కాలికి మొద్దుజోడు. చెమట. సూర్యాతపము, బాట ధూళీ, మట్టి, ఇన్నీ కలసి అతనిరూపాన్ని మరింతవికృతమొనర్చాయి. జుట్టు అంటకత్తిర వేయబట్టి బిరుసుగా మొలిచి భయంకరంగా ఉంది.

ఎవ్వరతన్నెరుగరు. ఏఊరు? దక్షిణమేమో! అటువైపు నుంచి వస్తున్నాడు. దినమంతా నడిచివుంటాడు. బాగా అలిసిపోయ్యాడు. దోవలో ప్రతిపంపుదగ్గర ఆగి, మంచినీళ్ళు తాగుతున్నాడు. తిన్నగా మేయరుగారి కచేరీకిపోయి ఒక పావుగంటసేపటికి బైటికివచ్చాడు. పోలీసుకనబడితే టోపీఎత్తి సలాంచేశాడు. పోలీసతనివంక తీవ్రంగాచూసి లోపలికి పోయాడు.

పాంథుడు తిరిగితిరిగి ఒకహోటల్ చేరుకున్నాడు. హోటల్ మేనేజరు తలెత్తిచూసి "ఏంకావాలయ్యా!" అన్నాడు.

"రాత్రికిభోజనం, పడక."

"శుభ్రంగావుండొచ్చు. డబ్బవుతుంది."

పాంథుడు జేబులోనుంచి పర్సుతీసి "నాదగ్గిర డబ్బుంది." అన్నాడు.

"తమచిత్తం."

"ఎంతసేపటిలో వడ్డిస్తారు?"

"ఇదిగో ఇప్పుడే"

పాంథుడు చలికాచుకొంటూండగా మేనేజర్ కాగితంపై ఏదోరాసి, ఒకకుఱ్ఱవాణ్ణి బైటికిపంపించాడు. పిల్లవాడు కాగితంతో తిరిగివచ్చాడు.

పాంథుడుసుఖంగా చలికాగుతున్నాడు.

"నీకిక్కడ జాగాలేదు"

పాంథుడు వెనుదిరిగి మేనేజరు కేసిచూశాడు.

"అదేమిటి డబ్బియ్యననిభయమా! ఇదుగోముందుగా పైస లిచ్చేస్తాను"

"అదికాదు"



'మరి'

'మాకు గదులులేవు'

'పోనీ గుఱ్ఱపుశాలలో పడుకొంటాను.'

"గుఱ్ఱాలాక్రమించుకొన్నాయి."

"అక్కడే ఒకమూల గడ్డిలో పడుకోవచ్చు. అయినా ఆసంగతి భోజనానంతరం చూసుకోవచ్చు."

"నేను భోజనంపెట్టడానికి వీలులేదు"

"టట్ ... నేనాకలితో మాడిపోతున్నాను. తెల్లవారగట్ల నుంచీ నడుస్తూనేఉన్నాను. ముప్ఫైమైళ్ళు నడిచాను. డబ్బిస్తాను కాదా తిండిపెట్టడానికేం?"

"ఇక్కడ తిండిలేదు."

పాంథుడు విడ్డూరంగానవ్వి "యిదంతా యేమిటి?" అన్నాడు. పాంథుడు కూలబడ్డాడు. "నేనాకలితో ఉన్నాను. డబ్బిస్తాను. ఇదిహోటలు నేవదలను."

మేనేజర్ అతనికేసివంగి "పో! అవతలికిపో! నీసంగతి నాకుతెలుసు. నీపేరు జీన్ వాల్జియన్ కాదూ! నీవురాగానే అనుమానించి, మాకుఱ్ఱవాణ్ణి మేయరుదగ్గరకుపంపాను. ఇదిగో చీటీ — అల్లరిచేయకుండా పో."

పాంథుడు తనమాట నెత్తుకొని, కళ్లుబట్టుకొని, దిగాలుపడి, బైటికవచ్చాడు. దోవపొడుగూతా జనం అతనివంక కళ్ళె ట్టుకు చూస్తున్నారు. అతనెవరిని గమనించలేదు. వెనుదిరిగి చూడలేదు. క్షితుడెప్పుడూ వెనుదిరిగిచూడడు. దురదృష్టము తనును వెన్నాడి వస్తూనేఉందని వాళ్ళకు తెలుసు. బాగా తెలుసు.

అతని కాకలెక్కువైంది. బాగా చీకటిపడుతూంది. తలదాచు కొనేందు కెక్కడైనా చోటు దొరుకుతుందేమోనని చుట్టూ కలయజూశాడు. ఒకచిన్నపాక కనబడింది. దొడ్డితోవను ప్రవేశించి "ఇక్కడ రాత్రికి తిండీ పడకా దొరుకుతాయా?" అని అడిగాడు.

'ఆ!'—అక్కడ నిప్పుచుట్టూ చాలామంది చలికాచుకొంటు న్నారు. నిప్పుమీద వంట పచనంఅవుతూంది.

నీరసపడి, బొబ్బలెత్తినపాదాలు సాచుకొంటూ, అతనక్కడ కూలబడ్డాడు. వంటకములవాసన కతనిమొగం కొద్దిగా వికసిం చింది. టోపీలోంచి కనపడే అతనిమొగంలో కొద్దివికాసం, అతనిరూపంలోని దౌర్భాగ్యం వింతగా మిళితమయాయి. వినయంతో మొదలిడి అతనివదనం కఠినుతేలింది. కను బొమ్మలకింద నిప్పుకణాల్లాగు కళ్ళు మెరుస్తున్నాయి.

అక్కడ కూర్చున్నవాళ్ళలో ఒకడతన్ని ఇందాకటి మనిషిగా గుర్తించాడు. గుసగుసలు బైలుదేరాయి. యజమానిచెవిలో రహస్యంపడింది. అతనిదగ్గరకునచ్చి కఠినంగా—

" ఇక్కడనుంచిపో అన్నాడు. "

పాంథుడు దీనంగా "మీకు తెలుసునా!"

" ఆ !"

" ఆహోటలులో నన్ను వెడలగొట్టారు "

"ఇక్కడా అంతే"

"ఎక్కడికి పొమ్మంటారు ?"

'ఎక్కడికైనా సరే"

ఆవ్యక్తి తనమాటా కత్తాపుచ్చుకొని మళ్ళీ బయలుదేరాడు. సందుచివర కాచిఉన్న కొందరు దుండగీళ్ళతనిపైకాద రాళ్ళు రువ్వసాగారు. దుడ్డుకర్ర చూపించగా పారిపోయారు. తిన్నగా జైలుకుపోయి దీనంగా " జైలర్ ఈరాత్రికి నాకు దులో చోటియ్యయ్యా! " అని అడిగాడు.

కఠినస్వరం —" జైలుఅంటే సత్రంకాదు. అరెస్టవు. ఖైదులో పెడతా."

పాంథుడొక చిన్నసందున పడిపోయాడు. చిన్నచిన్నతోటల్లో ఇళ్ళదీపాలు కనబడుతూన్నాయి. ఒకయింట్లో నల్లభైయేళ్ళ గృహస్థు భోజనానికి టేబిలువద్దకూర్చుని మోకాలిపై బిడ్డను కూర్చోబెట్టుకొని ఆడిస్తూన్నాడు. ప్రక్కనే ఒకయావని బిడ్డకుపాలిస్తుంది. పిల్లలు కేరింతలు కొట్టుతున్నారు. తల్లి నవ్వుతూంది. తండ్రి సంతోషిస్తున్నాడు. పాంథుడీ దృ

శ్యాన్ని విభ్రమంతో చూసి, "ఇంత ఆనందం ఉన్నచోట ఆవాత్రిం ఆతిథ్యం, దయ ఉండవా!" అనుకొని పోయి, తలుపు తట్టాడు. లాంత రుచ్చుకొని యజమాని బైటికి వచ్చాడు.

"ఆయ్యా క్షమించండి. డబ్బిస్తాను. కాస్త తిండిపెట్టి ఒక మూల పడుకొనేందుకు చోటిస్తారా"

"ఎవరునువ్వు?"

"నేను ముప్పైమైళ్ళదూరంనుంచి వస్తున్నాను. పొద్దుటి నుంచీ నడుస్తున్నాను. తిండిపెడతారా? నిజంగా డబ్బిస్తాను."

"నాకేం అభ్యంతరము లేదు, గాని హోటళ్ళ కెందుకుపోవు?"

"అక్కడ చోటు లేదన్నారు."

"చోటు లేకపోవటమేమిటి? ఇవాళ్ళ సంత యేమీలేదే! అన్ని చోట్లకు వెళ్ళావా?"

"ఊ"

"ఎక్కడా చోటు లేదా?"

'లేదన్నారు'

యజమానికొక సందేహంతోచి నఖశిఖ పర్యంతం ఆగంతుకుణ్ణి పారచూచాడు.

'ఆమనిషివి నువ్వేనా ఏమిటి?' మొగుడామాట అనేటప్పటికి భార్య బిడ్డల నిద్దరని కౌగలించుకొని భర్త చాటుకుచేరి—

'అమ్మో! అమ్మో! దుర్మార్గుడు' అంది. అంతా ఒక్క క్షణంలో జరిగింది. భర్త తలుపు వేస్తూ—

'పో! అవతలి' కన్నాడు.

'కరుణించండి, చెంబెడు మంచినీళ్లియండి.'

'ఇక నిలిస్తే తుపాకీ గుండే.'

తలుపులు మూసికొన్నాయి. అప్పటికప్పుడే చలిప్రారంభించింది. దగ్గర, ఇంకో కాంపౌండులో పాక ఒకటుంటే పాంఘుడు గోడదూకి, ఆపాకలో గడ్డిపరుచుకొని పడుకోబోయాడు. ఇంతలో అక్కడున్న కుక్క 'భౌయ్యి' మని అతనిపైబడింది. కర్రతో దాన్నదలిస్తూ అతను రోడ్డుమీదకి వచ్చేశాడు.

"కుక్కనైనా కాకపోయానే అని గొణుగుకుంటూ తలవంచుకుపోతూన్నాడు. చంద్రోదయం ఇంకా కాలేదు. కొద్దివెలుగు ఎక్కడిదో మిగిలింది. ఆకాశంకన్న నేలమీద తక్కువ వెలుగు ఉండటంచేత దృశ్యం భీభత్సంగా, నీచంగా, శ్మశానంలాఉంది. ఈనిరామయాన్ని, ఈనిరాశా పూరితాన్ని చూచితలవాల్చాడు. ప్రకృతికూడా అల్లాంటప్పుడు శత్రువౌతుంది. కాసేపు తలవంచి ఆలోచించి అతనువెనుదిరిగాడు. తోవలో ఒకరాతి పలకమీద కూలపడ్డాడు.

ఒకముసలమ్మ ఆతోవనుపోతూ 'ఏంచేస్తున్నావు నాయనా' అని అడిగింది.

"నిద్రపోతూన్నాను. కళ్ళులేవా?" అన్నాడు కఠినంగా

"ఇక్కడనా?"

"19 ఏండ్లు కొయ్యబల్లమీద పడుకొన్నాను. ఇవాళ ఈరాతి పలకమీద."

"నువ్వు సోల్జరువా బాబూ?"

"ఊఁ!"

"హోటలుకు పోరాదా?"

"డబ్బులేదు"

'అయ్యో పాపం! నాదగ్గర రెండుడబ్బులే ఉన్నాయి."

'ఇల్లాఇయ్య' అనిపుచ్చుకొన్నాడు.

'రెండు డబ్బులకు తిండెవరు పెడతారు. పాపం ఆకలేస్తోంది కాబోలు. ఎవరూ అండయివ్వాలా'

'ప్రతిఇంటా అడిగాను.'

'ఆ ఎదురింట్లో అడిగావా'

'లేదు.'

'అక్కటికి వెళ్ళు నాయనా!'

2

బిషప్పు పొద్దుపోయేదాకా ఏదో వ్రాసికొంటూ చెల్లెలి కాలస్యమవుతుందని భోజనానికి లేచాడు. భోజనశాల తలుపు వీధిలోనికి తెరుచుకొంటుంది. బిషప్పు మేజావద్ద కూర్చున్నాడు.

అతని చెల్లెలు "అన్నా! మేగ్లోయిర్ చెప్పేది విన్నారా!" అన్నది.

'కొద్దిగా విన్నాను.' అని వారివంక తిరిగి 'ఏమన్నా అపాయం వచ్చిందా'? అన్నాడు.

మేగ్లోయిర్ తన కథ మళ్ళీ చెప్పింది. ఎవడో బందిపోటు దొంగ ఊళ్ళో రోడ్డుమీద పోతున్నాడట సాయంత్రం ఎక్కడెక్కడో వెళ్ళగొట్టారట. చీకటి పడ్డప్పుడు ఇళ్ళచుట్టూ తారాడుతున్నాడట. మొహంచూస్తేనే భయమేస్తుందట. ఖూనీలు చేసే వాడి లాగుంటాడట.

'అల్లాగేం' అన్నాడు బిషప్పు సావధానంగా.

మేగ్లోయిర్ పురాణం విప్పింది. 'అవునండీ! ఈ రాత్రేదో ఘాతుకం జరుగుతుందనే అంటున్నారు. ఈ కొండఊళ్ళో వీధుల్లో దీపాలన్నా లేవు. నే చెప్పేది, అమ్మగారు చెప్పేది ఏమంటే—'

'నే నేం చెప్పటంలేదు. నే మా అన్నతో ఏకీభవిస్తున్నాను.' మేగ్లోయిర్ ధోరణి ఆగలేదు.

'ఈ యింటి కింకా కొంచెం రక్షణ ఉండాలి. బాబుగారు తలుపు చప్పుడవటం తడవుగా లోపలికి దయచేయమంటారు. ఇంతకన్నా—'

వాకిటి తలుపుకొట్టిన చప్పుడైంది.

'లోనికి దయచేయండి. '

3

ఎవరో బలంగా తోస్తున్నట్లుగా తలుపు తెరుచుకొంది. మనకు పరిచితుడైన పాంథుడు తలుపు తెరచి, గుమ్మంలో నిలబడ్డాడు. బుజంపై మూట, చేతిలో కఱ్ఱ, మొగంలో మోటుతనం, ఆయాసం, కళ్ళలో క్రౌర్యం. చలిమంట వెలుగు అతనిమీద పడి మరింత భయంకరుణ్ణి జేసింది. మానవుడేనా ?—

మేగ్లోయిర్‌లో అరచేందుకూ—డా శక్తి లేక, నోరు తెరుచుకొని వణుకుతో నిలబడ్డది. బాప్టిస్టీన్ భయంతో సగంలేచి, మరల అన్నగారివంక చూసి ధైర్యం తెచ్చుకొని శాంతంగా కూర్చుంది. ఆగంతుకుడు రెండుచేతులతో కఱ్ఱనానుకొని నిలబడి, ఆ యిద్దరు ముసలమ్మలవంక, ఈ పండిన వృద్ధునివంక చూస్తూ, బిషప్పు మాట్లాడటానికి పూర్వమే గట్టిగా అన్నాడు.

'నాపేరు జేన్ వాల్జియర్. పాతఖైదీని. పందొమ్మిదేళ్ళు జైలు పడ్డాను. నాలుగురోజుల క్రితం విడుదల అయాను. 'ఫాంటర్లే'కి పోతున్నాను. టూలన్ వదిలిందాదిగా, కాలి నడకనే ఉన్నాను. ప్రొద్దున్నించి ముప్పైమైళ్ళు నడిచాను. హోటళ్ళలో నన్ను వెళ్ళగొట్టారు. జైలుకెళ్ళాను. మళ్ళీనన్ను జేర్చుకోలే. ఒకపశువుల పాకలో పడుకొందామంటే కుక్క తరిమేశింది. పొలాల్లో పడుకొందామని పోయాను. వర్షము వస్తుం

దనిపించింది. ఆపే దేవుడున్నాడు గనకనా? ఏ గుమ్మంలో అన్నా పడుకొందామని మళ్ళీ ఊళ్ళోకి వచ్చాను. ఒకరాతి మీద పడుకొంటే, ఒకచల్లనితల్లి, ఈ ఇంటికి పొమ్మని చూపించి యిక్కడ అడగమంది. ఇదేంయిల్లు? ఎవరిది? తిండిపెడతారా యిక్కడ? డబ్బిస్తాను. నాదగ్గిర 109 ఫ్రాంకులున్నాయి. 19 ఏండ్లుగా జైలులో సంపాదించాను. తిండికి డబ్బిచ్చుకోగలను. అలిసిపోయి ఆకలితో ఉన్నాను. ఇక్కడ ఉండ నిస్తారా?'

'అవ్వా! ఇంకోకంచంలో వడ్డించు' అన్నాడు బిషప్పు.
ఆగంతుకుడు మూడడుగులు ముందుకు వేసి దీపందగ్గరకువచ్చి "ఒక్కనిమిషంఆగు నేను 'గాలీస్'లో బానిసను జైలునుంచి వచ్చాననీ, కేడీనని చెప్పింది విన్నారా." అని జేబులోనుంచి పచ్చకాగితంతీసి చూపించాడు.

'ఇదిగో నాకాగితం; ఈపచ్చదనంచేత నాకెక్కడా నిలవనీడ దొరకదు. చదువుతారా! నేచదువగలను. జైలులోచదువు నేర్చుకొంటే చెప్తాతారు. ఇదుగో 'జీన్ వాల్జియన్' కాన్విక్టు, పంధొమ్మిదేళ్ళు గాలీ బానిస. 5 ఏళ్ళు ఇల్లు బందిపోటుకు. 14 ఏళ్ళు నాలుగుసార్లు పారిపో యత్నించినందుకు. చాలా భయంకరుడు.'

ప్రపంచమంతానన్ను తరిమేసింది. మీరునన్నురానిస్తారా? ఇదేమన్నా సత్రమా (Inn)? తిండి, పక్క ఏమైనా ఈగలరా? మీకుపశువులపాక వుందా?"

' మేగ్లోయర్ ? అతిథిశాలలో పక్క శుభ్రంగా దులిపివేయ మ్మా! '

బిషప్పుమాట ఆవనిత లెల్లా పాలిస్తారో మునుపే చెప్పాం. మెగ్లోయిర్ తనపనిమీద పోయింది. బిషప్పు ఆగంతుకుని వంక దిరిగాడు.

'అయ్యా రండి! కూర్చోండి. చలికాచుకోండి. ఇదుగో వడ్డిస్తోంది. మనం భోజనం చేసేలో పలమీదపక్క తయారవుతుంది.'

కాఠిన్యంతో నిండిన అతనిమొగంలో ఒక్కసారిగామార్పు కలిగింది. విభ్రమం, సంతోషం, అనుమానం, మిళితమయాయి. అతనిమాటసాఫీగారాక నత్తిపడ్డది. పిచ్చివాడులాగ అన్నాడు. "నిజమేనా! ఏమిటి! నన్నుతరిమేయరా! ఉండనిస్తారా! నన్నేనా? 'అయ్యా' 'అండీ' అనటం? ఏరాఅని కాదూ? ఛీ పోరాకుక్కా! అనేనే నన్నెప్పుడూ అనటం. నన్ను తరిమేస్తారనుకుంటూనే నేనుమీకు నిజమంతా చెప్పేశాను. నన్నిక్కడకుపంపిన తల్లికడుపెంతచల్లనిదో! ఏమిటీ! అందరికిలాగే తృప్తిగాభోజనం, పడక్కి పరుపు మంచం! పందొమ్మిదేళ్ళ పక్కబట్టలెరుగనే! నిజంగానన్నుండమంటున్నారా! అయ్యా! మీరెవరో సత్పురుషులు. నాదగ్గరడబ్బుంది. మిమ్మల్ని తృప్తిపరుస్తాను. నిజంగామీరు ఈ దగ్గవారు. బాబూ! మీపేరేమిటి ? మీకెంతకోరితే అంతయిస్తాను. మీరు పూటకూళ్ళు పెట్టుకొన్నారా ?'

' నేనొకపీఠ్రస్టుని. ఈఇంట్లోఉంటున్నాను. '

'ప్రీస్టు ! ఏంతమంచిప్రీస్టులో ! నన్ను డబ్బడగరనుకొంటాను. ఆపెద్దచర్చిలో (Church)మీరేనా ?'

మాట్లాడుతూనే అతను తనసంచి, కఱ్ఱ, మూలపెట్టి పచ్చ కాగితం జేబుచేర్చి, కూలబడ్డాడు.

'అయ్యో! మీరుదయాపూర్ణులు. మీరునేనంటే ఏవగించు కోలేదు. మంచిప్రీస్టుండటం చాలాకష్టం. అయితే, నిజంగా మీకు డబ్బక్కరలేదా ?'

బిషప్పు : 'అక్కరలేదు. ఉంచుకోండి. ఈ 109 ఫ్రాంకు లెన్నాళ్ళ సంపాదన ?'

'పందొమ్మిదేళ్ళు.'

'పందొమ్మిదేళ్ళు!' బిషప్పు దీర్ఘనిశ్వాసం వదిలాడు.

అతనుచెప్పసాగాడు. 'నేనాట్టేఖర్చుపెట్టలే. ఈనాలుగురోజులూ గ్రాసీలో బస్తాలుమోసి సంపాదించిన 25 సోలు మాత్రమే ఖర్చు చేశాను. మీరు ప్రీస్టులు కాబట్టి చెపుతున్నాను. మేము జైలులో ఉన్నప్పుడు ఒక బిషప్పుగారు వచ్చాడు. ఆయన ప్రీస్టులకంటె పైవాళ్ళకంటె పై వాడు. క్షమించండి. మీకు తెలిసినవే తెలివితక్కువగా చెబుతున్నాను. కాని మేము మూఢులం. ఆయన జెప్పేది నాకేమీ వినపడా లేదు, తెలియాలేదు. శరగోపురంమాత్రం ఆయన శిరాన తళతళల్లాడ్తోంది...''

మేగ్లోయిర్ వడ్డించింది.

బిషప్పు లేచి తలుపు దగ్గరగా వేశాడు.

'కొండగాలి చలిబాగా వేస్తోంది. మీకూ చాలా వేస్తోందాండి?' బిషప్పు 'అండి' అన్నప్పుడు, 'అయ్యా' అన్నప్పుడు, అతని ముఖం జేవురించేది. పేదకి గౌరవవాచకం, సముద్రతీరాన్న దాహంతో తపిస్తున్న వాడికి మంచితీర్థం లాగుంటుంది. అవమానితం గౌరవానికి తపిస్తుంది.

'ఈ దీపం వెల్తురియ్యటం లేదమ్మా!' అన్నాడు బిషప్పు.

మేగ్లోయిర్ అర్థంచేసికొని వెండిసెమ్మాలని తెచ్చి వెలిగించింది.

'అయ్యా మీరు సజ్జనులు. నేనంటే అసహ్యించుకోటం మాని, స్నేహితుణ్ణిలాగాఆదరించి, వెండి దీపాలు అవి పెట్టుతున్నారు. కాని నేను నాపేరుగాని, నా నివాసంగాని, నా దురదృష్టంగాని మభ్యపెట్టలేదు.'
బిషప్పు అతని చేతిమీద తన చేత్తోనిమురుతూ నెమ్మదిగా చల్లని పలుకులు పలికాడు.
'మీ రెవరో నాకు చెప్ప నవసరంలేదు. ఈ యిల్లునాది కాదు. (పైకి చూపి) అతనిది. ఈగుమ్మం 'నీ పేరేమిట' ని అడగదు. 'నీ దుఃఖమేమి టని అడుగుతుంది. బాధితుడివి. ఆకలి దప్పులతో అలిసి ఉన్నావు. ఆతిథ్యాని కొస్తాడవు. నే నాదరిస్తున్నానని నన్నభినందించ నక్కరలేదు. ఎవరి

అవసరం ముఖ్యమో ఈ యిల్లు వాళ్ళది. ఇక్కడ ఉన్న సర్వం నీదే అనుకో! నీ పేరా! నీవు చెప్పకుండానే నాకు తెలుసు.'

విస్మయంతో అతను కళ్ళు పెద్దవి చేశాడు.

'నిజమా! నా పేరు మీ కెరుగుదురా!'

'ఆ! నీవు నా సోదరుడివి.'

'అయ్యా! నేనిక్కడకు వచ్చేటప్పటికి ఆకలి వేస్తోంది. కాని దయాపూరితమైన మీ చల్లని మాటలతో నా కడుపు నిండిపోయింది. ఆకలి పోయింది.'

బిషప్పు అతని వంక చూశాడు.

'బాబు! చాలా కష్టాలు పడ్డావా?'

'ఓఁహూ! ఎర్ర చొక్కా— కాళ్ళకి ఇనపగుళ్ళు, పడుకునేందుకు బల్లచెక్క— ఎండ, చలి, కాయకష్టం, ఖైదీల పోరుగు— ఉత్త పుణ్యానికి రెండు వరసల ఇనుపగొలుసులు- నోరు మెదిపితే చీకటి కోణం— జ్వరంలోనైనా సరే—కుక్కల బతుకైనా నయమే! పందొమ్మిదేళ్ళు! నాకిప్పుడు నలభై ఆరు! తుదకీ నాకు ఈ పచ్చ కాగితం.

"ఔను నాయనా! దుఃఖ మధ్యం నుంచి నువ్వొచ్చావు. కాని నామా టొకటివిను. నూర్గురు సత్పురుషుల ఆగమనం వల్ల కన్న ఒక్క పాపాత్ముడి కన్నీటి తలుకుతో స్వర్గధామం ఉత్తేజిత మవుతుంది. ఆ దుఃఖ ప్రదేశం నుంచి మానవ

లోకంనుంచి మానవ లోకం అంటే, అసహ్యంతో, వైష
మ్యంతో, క్రౌర్యంతో నువ్వు వచ్చినట్లయితే నిన్ను చూసి
జాలి పడాల్సొస్తుంది. కాని కరుణతో, శాంతంతో, ప్రపంచ
మంటే సానుభూతితో ఆపరిదేశాలనుండి వచ్చి నట్టయితే,
అందరికన్నా ఉత్తముడివి, పూజితుడివి అవుతావు."

ఆకలితో అతను తిండి సాగించాడు. అతిథులు వచ్చినప్పుడు
బిషప్పు తన యింట్లోవున్న పాతవెండి సామానంతా బైట
పరపించేవాడు. బిషప్పు యొక్క ఈఅమాయికపు సంతో
షంలో దారిద్ర్యానికి గాంభీర్యం యిచ్చే వన్నె ఉండేది. ఆవే
ళ మేగ్లోయిర్ వెండిపళ్ళెంతేలేదు. బిషప్పాజ్ఞ మీద అదికూ
డా తెచ్చి అక్కడ బెట్టింది.

భోజనం చేసినంతసేపూ అత నెవరివంక చూడలేదు. భో
జన మైన తరువాత తృప్తిపడి, బిషప్పువంక తిరిగి—
"అయ్యా! నేపీటికి తగను. కాని నన్ను పంక్తికిరానియ్యని
క్రీస్తులు చాలామంది మీకంటే ఎక్కువ కులాసాగా వుం
టారు."

"వాళ్ళకు పనులెక్కువుంటవి"

" కాదు వాళ్ళకు డబ్బుంది. మీరు బీదలని నాకు కనబడు
తూంది. భగవంతుడిలో న్యాయముంటే మీరింకా పెద్ద
స్థితిలో ఉండాలి.'

' భగవంతుడు నా విషయంలో సంపూర్ణ న్యాయం
కన్నా ఎక్కువే జరిపాడు. మీరు పాంటర్లీ వెళుతానని
చెప్పినట్లున్నారు!'

'ఔను సెళ్ళకతప్పదు. చీకటితో బయలుదేరాలి. రేపు పెద్దప్రయాణం.'

భోజనం చేస్తూన్నంతసేపూ బిషప్పతనితో కులాసాగా మాటలు చెబుతున్నాడు. ఫాంటర్లీలో వృత్తులు, అవి విశదంగా చెప్పాడు. అతని పూర్వచరిత్రం, జైలు, స్ఫురణకు వచ్చే వాక్యాలకైనా బిషప్పరానియలే. ఇంకెవరైనా అయితే అతనికి గట్టిగా నీతులు చెప్పి, వెంటనే సన్మార్గంలో పెట్టటానికి బ్రహ్మాండమైన ప్రయత్నం చేసేవాళ్లు. బిషప్పా ఊసెత్తలేదు. అతని నికృష్టజీవితం అడుగడుక్కీ అతనిమనసును వేదించుతున్నదేమో అని అతని దౌర్భాగ్యం అతనికి తోచనీయకుండా మరిపించుతూ సంతోషంగా కబుర్లు చెప్పాడు.

'మీకు పడకను చూపిస్తాను, రండి.'

బిషప్పు వెండిసెమ్మా పుచ్చుకొని జీన్ వాల్జియన్ వెంటరా, అతని గదికి తన గదిలోగుండా (ప్రక్కగదే) తీసుకు పోయాడు. పక్క శుభ్రంగా పరచి ఉంది.

'సుఖనిద్రపొండి, పొద్దున్న గ్లాసెడు గుమ్మపాలు తాగి బయలుదేరవచ్చును.'

'కృతజ్ఞుడ నండీ!' అన్నాడో లేదో అతనిలో ఏదోవికారం కలిగింది. బిషప్పువంక తిరిగి భయంకరంగా—

'నన్నింత దగ్గిరగా పడుకోనీటమా' అని వికృతంగానవ్వి, 'నేను హంతకుణ్ణి కానని ఏమిటి నమ్మకం?'

"ఆవిషయం దైవానికి వదిలేద్దాం" అనిబిషప్పు స్థిరంగా నిల బడి, తనచేయి అతని మూర్ధాన్నుంచి ప్రార్థించుతూ, అతన్నా శీర్వదించాడు. అతను తలవాల్చ లేదు. బిషప్పు మంచం దగ్గరకు పోయాడు.

బిషప్పు మాకరిస్తూ కన్నులుమూసి ప్రార్థించి, కొంతసేపటికి లేచి. అల్లాగే దైవాన్ని మననంచేసుకొంటూ, తోటలోకిపోయి దైవచిత్రాల్ని చూస్తూ నిలబడ్డాడు.

జీన్ వాల్జియన్ పూర్తిగా అలిసివుండటంవల్ల అల్లాగేపడు కొని గాఢంగా నిద్రపోయాడు.

# 3 వ ప్రకరణము

అర్థరాత్రివేళ జీన్ వాల్జియన్‌కు మెళకువ వచ్చింది.

జీన్ ఒక పేద కుటుంబానికి జెందినవాడు. అతని తలిదండ్రులు బాల్యంలోనే చనిపోయారు. అతని అప్పగా రతన్ని తన భర్త ఉన్నంతకాలం పోషించేది. అతనికి పాతికేళ్ళు వచ్చే టప్పటికి ఆమెభర్త చనిపోయాడు. ఆమెకేడుగురు బిడ్డలు. పెద్దవాని కెనిమిదేళ్ళు. చంటిబిడ్డ కేడాది. నాటినుండి బిడ్డలను, తల్లిని అతనే పోషించ వలసివచ్చింది. ఇందులో అత నెట్టి ప్రేమాచూపలేదు. ఒక విధ్యుక్త ధర్మం నెరవేర్చు కొంటున్నట్లే వారిని పోషించాడు. అందుచేత వాళ్ళపట్ల ఎక్కువ సాధుత్వం చూప లేదు. వారి పోషణకై అతను యౌవనమంతా కాయకష్టంలో గడప వలసి వచ్చింది. అతని యౌవనంలో ప్రణయానికి, ప్రియురాలికి తావులేకపోయింది.

పగలంతా పనిచేసి రాత్రికతను ఇంటికి వచ్చేసరికి అతనప్పగారు కంచంలో వడ్డించేది. అతను తలవంచుకొని కంచంమీదికి వంగి చారు తాగుతూన్నప్పుడతని విస్తరిలోవి తీసి తనకొడుకులకు పెట్టేది. అతను చూడనట్లు నటించేవాడు. పిల్లలు తల్లికి తెలియకుండా పాలమనిషిదగ్గిర పాలుపుచ్చుకొని దానిలో భాగాలకు కొట్లాడుకునేవారు. అప్పకీవిషయం తెలియనీకుండానే జీన్ పాలడబ్బు ఇచ్చేసేవాడు.

పంట రోజుల్లో అతను రోజుకు 8 సోలు సంపాదించేవాడు. అప్పకూడా కూలిపనులుచేసేది. కాని ఏడుగురు బిడ్డల సంసారం. నానాటికీ దారిద్ర్యం గాఢాంధకారంలాగా వాళ్ళను తనలో ముంచుకొంటూవచ్చింది. ఒక సీతాకాలం బ్రతుకు మరీకష్టమయిపోయింది. కూలి దొరికేది కాదు. ఒక్క కబళమైనా లేదు. ఏడుగురు బిడ్డలు!

పక్కనున్న రొట్టెల దుకాణం దారొకనాడు తలుపులు వేసుకొంటూండగా కిటికీఅద్దం బద్దలయింది. ఒక చెయ్యి, రొట్టి ముక్కను లాక్కొని మాయమైంది. దుకాణాదారు దొంగను పట్టుకొన్నాడు. రొట్టె దొరకలేదుగాని, చెయ్యంతా చీరుకుపోయి రక్తంకాగుతూనే ఉంది. జీన్ వాల్జియన్‌ను న్యాయస్థానానికి తీసుకుపోయారు. తలుపులు బద్దలుకొట్టేదొంగతనము, బందిపోటు క్రింద లెక్క. జీన్ వాల్జియన్‌కి తుపాకి ఊది మంచి గురిగాడు. ఇవన్నీ అతనికే నష్టదాయకమయ్యాయి. భయంకరుడైన దొంగగా నిరూపించి, కోర్టువారు 5 ఏళ్లు ఓడబానిసగా (కఠినవరకం) శిక్షవిధించారు.

మెడచుట్టూ గొలుసు తగిలించి, సుత్తితో తాళంబిగించాడు. అతను కన్నీళ్ళు పెట్టుకొని, 'నాది ఫావరోల్స్' లో కట్టెలుకొట్టు కొనేవృత్తి' అని గొణిగాడు. చెయ్యి కొద్దిగా ఎత్తి ఏడుసార్లు కిందకు తగ్గించుకొంటూ వచ్చాడు. నే నేపాపం చేసినా ఆబిడ్డలేడుగురి కోసం చేశానని భావమేమో! టూలన్ తీసుకు పోయాక ఇరవై ఏడురోజుల బండిప్రయాణం. మెడచుట్టూ గొలుసు, ఎట్టిచాకిరీ. ఆనాటిదాకా అతను జీవించిన జీవితమంతా ఒక్కసారిగా తుడిచిపెట్టుకు పోయింది పేరుతోసహా. ఆవేళనుంచీ అతను నెం. 24601 రు!

ఏడుగురు బిడ్డలేమయ్యారు? తల్లిఏమైంది? నాలుగేళ్ళతర్వాత ఎవరో అతని అక్కను చూశామని అతనితో చెప్పారు. ఆవిడవెంట ఏడేళ్ళ బిడ్డ ఒకడు మాత్రం ఉన్నాడు. తక్కిన ఆరుగురు? ఆవిడకే తెలియదేమో! అచ్చాఫీసులో కూలి పనిచేసేది. పిల్లవాణ్ణి అచ్చాఫీసు పక్క ఉచితవిద్యాలయానికి తీసుకొచ్చేది. ఆఫీసు ఆరుగంటలకు, బడి ఏడుగంటలకు. ఆ చలిలో అతను వాకిటి గుమ్మంలో కూర్చునేవాడు. ఎదుటి గుడిశలోఉన్న ముసలమ్మ అతన్ని కరుణించి లోపలకు రానిచ్చేది. ఒకమూల ఒక పిల్లికూనను కౌగలించుకొని అతను చలికాగేవాడు. ఆతరువాత మళ్ళా వాళ్ళేమయ్యారో తెలియదు. కారుమేఘంలో మెరుపుతళుకులాగా ఈకొత్త కథా జీన్ వాల్జియన్‌కు తెలిసింది. ఇకతరువాతి సంగతి తెలియదు.

నాలుగోయేట వాల్జియన్ జైలులోనుంచి తప్పించుకొని, పారిపోయి రెండు రోజులు స్వేచ్ఛ అనుభవించాడు. ఎల్లాం

టి స్వేచ్ఛ! —చీమ చిటుక్కుమంటే, ఆకల్లాడితే, కుక్క మొరిగితే, గుఱ్ఱపుడెక్క మోతవినపడితే, గంటమోగితే, హడలిపోతూ, నరుడికంటపడకుండా దాక్కుంటూ, తిండిలేక అల్లాడుతూ— అల్లాంటిస్వేచ్ఛ. రెండోరోజుసాయత్రం పట్టుకొన్నారు. జైలువదిలేక అతను తిండితినలే. పారిపోయినందుకతనికిశిక్ష ఎనిమిదేళ్ళు వేశారు. ఆరోఏట మళ్ళీపారిపోయేందుకు ప్రియత్నించి ఓడచుక్కాని చాటున దాక్కున్నాడు. కాపరి అతన్ని చూసి పట్టుకునే సరికి పెనుగులాడాడు. తప్పించుకోటానికి ప్రయత్నం. పైగా అధికారితో పెనగులాడటం. రెండు నేరాలు. మరొక ఐదేళ్ళు జోడుసంకెళ్ళు ఇంకోసారి పారిపోయేందుకు ప్రియత్నించాడు. మళ్ళీమూడేళ్ళు. ఆఖరి తడవ మళ్ళీపారిపోబోతే మళ్ళీపట్టుకున్నారు. మళ్ళీమూడేళ్ళు. మొత్తం పందొమ్మిదేళ్ళు. అప్పబిడ్డలకోసం ఒకచిన్నరొట్టెముక్క నెత్తుకువచ్చినందుకు పందొమ్మిదేళ్ళు కఠినవరకం.

పందొమ్మిదేళ్ళలో, అమాయకుడుగా ఫావరోల్స్‌లో కట్టెలుకొట్టుకొనేజీన్ వాల్జియన్, జైలుపుణ్యమా అని ద్విविధాలాభయంకరుడుగా మారాడు. ముందు వెనుక లాలోచించకుండా కష్టాలకు ప్రతీకార మనుకొని సంఘాని కేఉధృతమైనా తలపెట్టే స్వభావం గలవాడుగా, రెండు—సంఘమూపితమైన హృదయంలో మాత్రమే జనింపగల భీభత్సకార్యా లొనరింపగల శక్తిగలవాడుగాను.

అతని సర్వ భావాలకు మూలం, జైలు మీందలాగే మానవలోకం మీంద ద్వేషం. నానాటికీ, ఆద్వేషం ఇనుమ డించింది.

అతని 'పాస్‌పోర్టులో' భయంకరుడని వ్రాసినమాట అతిశయోక్తి కాదు.

నిన్ను విడుదల చేశామన్న పలుకు జీన్‌వాల్జియన్‌కి అర్థము కాలేదు. ఒక అసంభవ మేదో జరుగుతూన్న ట్లనిపించిం దతనికి. అతనికి జైలులో 171 ఫ్రాంకులు రావాలి. అతని చేతికి 109 ఫ్రాంకులు వచ్చాయి. తక్కిన డబ్బు మధ్యదోవలో నిలబడిపోయింది. ఈపద్ధతిని అతన్ని దోచినట్లు అతనికి తోచింది.

వదిలిపెట్టిన నాడతనొకచోట బస్తాలు మోస్తూంటే ఒక పోలీసు చూసి యజమానితో ఏదో చెప్పిపోయాడు. జీన్ ప్రక్కవాళ్ళని కూలెంతని అడిగాడు, 30 సోలు. సాయంత్రం యజమాని 15 సోలు చేతిలో పెట్టాడు. అతను కారణం అడిగితే జైలుపేరు చెప్పి బెదిరించాడు.

మళ్ళీ దోపిడి !— సంఘం, ప్రభుత్వం, తన్ను మొత్తంగా దోచింది. ఇప్పుడు వ్యక్తులు చిల్లర చిల్లరగా దోస్తున్నారు. విడుదలకు, స్వాతంత్ర్యానికి ఇంత తేడా ఉందా! జైలునుంచి విడుదల అయినంత మాత్రాన్న సంఘనిరసనంనుంచి విముక్తి కాదు. డి–లో అతనికి జరిగిన అవమానం మనం ఎరిగున్నదే.

## 2

చర్చిగంట రెండు కొట్టేటప్పటికి జీన్‌వాల్జియన్‌కు మెలకువ వచ్చింది. నిజానికి పరుపు మెత్తని దవటంవల్లనే

అతను మేల్కొన్నాడు. ఇరవై యేళ్ళుగా అతను కర్క-శ శయ్య నిద్రించాడు. ఇంత సౌఖ్యం అతనికి వెక్కసమయింది. అతిగాఢంగా, కోటన్నా విప్పకుండా బూటుతో సహా అతను అల్లా నాలుగుగంటలునిద్రించాడు.

మనస్సు కల్లోలపడి, శరీరం చికాకుపడ్డరోజున నిద్రమొదటి తడవ రావచ్చు. కాని మెలకువ వచ్చాక నిద్రపట్టడం చాలాకష్టం. పాతభావాలు, కొత్తభావాలు అన్నీ వింతవింత గా ఒకదానికొకటి అడ్డంగా అతని మనస్సులో పరుగెత్తుతు న్నాయి. అన్నిటి మధ్యనుంచి ఒకటిమాత్రం మాటిమాటికి కళ్ళల్లో మెసులుతోంది. ఆ యింట్లో వెండిసామాను. ఉత న్నాళ్ళు సంపాదించిన డబ్బు కంటే— అన్యాయం జరగ కంటే ఇంకా వచ్చేదేమో— రెండురెట్లు, 200 ఫ్రాంకులు పైగా వెండిపళ్ళెమే చేస్తుంది. ఆసామాన్లు తన కందుబాటు దూరంలో ఉన్నాయి. అన్నబీరువాలో పెట్టడం తను చూ ... ల్లాగే ఊగులాడే మనస్సుతో ఒక గంట గడిపాడు.

టంగ్-టంగ్-టంగ్—మూడు కొట్టింది. అతను కన్నులు తె రిచి బద్ధకంతీర్చుకొని, మంచంమీద కూర్చుని, తనసంచీకో సం తడుముకొన్నాడు. అతనికి తెలియకుండానే అతనలా మంచంమీద కూర్చున్నాడు. మళ్ళా సందేహాలు, మళ్ళా ఆలోచన.

పాస్సగం ఒకొట్టింది. అతనికి ప్రబోధంలాగుంది. చటాలున లేచి, సంచివిప్పి ఇనుప గడారొకటి తీశాడు. బూడ్సులువిప్పి సంచి

లోపెట్టె సంచి బుజాన్వేసుకొని, టోపీ మొఖంమీదికిలాగుకొని, చేతిలో ఇనుపపనిముట్టుతో బయలుదేరాడు. ఏంచేయబోతు న్నాడు? అతనికూడా తెలియదు.

బిషప్పు గదిదగ్గరికి మునివేళ్ళమీద నడుచుకుంటూ పోయా డు. తలుపు చేరవేసి, ఉంది. తలుపుతోశాడు. కొద్దిసందు ఏర్పడింది. ధైర్యంతో ఇంకా గట్టిగా తోశాడు.

కర్ ర్ ర్ ర్ ర్ ——.........

బందు పాతదవడంవల్ల పెద్దగా ధ్వనిఅయింది. మునివేళ్ళమీద మనిషి, మడమలమీదికిపడి వణకుతో నిలబడ్డాడు. పంచభూతా లు దొంగయని తన్ను పట్టిస్తున్నాయా అన్నంతభయమేసింది. ఈ తలుపుబందుకు ప్రాణంవచ్చి యింటివాళ్ళను లేపుతోం దా ? ఇంట్లో అందరూ లేచి తన్ను పట్టుకోడానికి పరుగెత్తు కొస్తున్నారా ? ధైర్యం తెచ్చుకుని లోపలకు చూశాడు.

నిశ్శబ్దము...ముందుకు సాగాడు. పోతూ బిషప్పు మంచం దగ్గిర హటాత్తుగా ఆగాడు.

మన కృత్యాలకు ప్రకృతి ఒక్కొక్కమారు వన్నెలు కలిపి స్తుంది. మనం వాటినిగురించి ఆలోచించేలా ప్రవర్తిస్తుంది. అంతవరకు మబ్బులు వెన్నెలను కమ్మేశాయి. అప్పుడే విడ బడ్డ ఒక చంద్రికిరణం బిషప్పు ప్రశాంతవదనంమీద ప్రస్ఫు టని మోము కాంతివంతం చేసింది. అతనిలోని వింత ...న్ను ముగ్ధుణ్ణొనర్చింది. కాని అర్థంకాలేదు.

తనలాంటి భయంకరుడికి ఇంతదగ్గిరగా ఇంత నిర్భయంగా ఇంతశాంతంగా నిద్రపోతూన్న వ్యక్తినిచూచి అతను విస్తుపోడా! అప్పుడు జీన్ వాల్జియన్ భావా లేమిటి? సుముఖత్వం సముఖాన భీకరత్వ మేమవుతుంది?

జీన్ వాల్జియన్ చూపు బిషప్పు వదనంనుంచి అక్కడే పైన వ్రేలాడుతున్న శిలువమీదికి పాకింది. శిలువ రెండుచేతులు చాచి ఉన్నాయి. ఒక కరము బిషప్పు నాశీర్వదిస్తూ ఒక కరమితన్ని క్షమిస్తూ ఆదరిస్తున్నాయేమో!

మళ్ళీ చర్చిగంట. మళ్ళా అతని ఊహా ప్రపంచం తెగింది. బలవంతముగా దృష్టి బిషప్పునుంచి మరల్చాడు. ధృడనిశ్చయంతో బీర్వావంకకే నడిచాడు.

3

మరునాడు పొద్దున్నే అవ్వ "బిషప్పుగారూ!" అంటూ వెదుక్కుంటూ వచ్చి "వెండిసామానుల బుట్ట పోయిందని" చెప్పింది. బిషప్పుతోటలో ఒకచిన్న బుట్టచూపించి 'ఇదిగో ఇక్కడుంది' అన్నాడు.

'సామానులో?"

'సామానులా! ఏమయాయో! ఎందుకవ్వా అంతకంగారు?.'

'అయ్యో దైవమా! రాత్రి వచ్చినవాడే దొంగయి—
పరుగెత్తుకుపోయి అతిథిమందిరం చూచివ—

" అయ్యా! వాడు లేడండి! సామాను ఎత్తుకుపోయాడు. "

అవి విలపించుతూ గోడ కేసి చూసింది. గోడమూకిన గుర్తు లు కనుపించాయి. 'ఇదిగో యీదోవ నేపోయాడు.'

బిషప్పాక నిమిషమాగి___

' అయితే అవ్వా! సామానేవరిది? '

మెగ్లోయిర్ మాటాడలేదు.

'అవ్వా! ఇన్నాళ్ళక్రమంగా ఆసామానులు నాదగ్గరట్టేపెట్టాను. బీదలవది. రాత్రివచ్చినత నెవరు? పేద.'

' తమ రెందులో భోంచేస్తారు?'

'విస్తరిలో.'

బైట కలజడి. ఇద్దరు పోలీసు లొక దొంగను పట్టుకొని, బిష ప్పు కొరకు వచ్చి తలుపు తట్టారు.

' లోపలకు రండి '

' పోలీసులు దొంగను తీసుకువచ్చి 'బిషప్పుగారూ' అని సంభోధించారు.

'బిషప్పా! క్రీస్తుమాత్రమేగా!' అని గొణిగాడు దొంగ.

' నోరు ముయ్యి. వీరు బిషప్పుగారు '

బిషప్పు దొంగవంకకు అడుగువైచాడు.

' ఆ! వచ్చావా, నాయనా! ఈ వెండిసెమ్మాలుకూడా ఇచ్చాను కదా! ఎందుకు తీసుకు తీసుకెళ్ళలేదు? ఇవి కూడా

2 వందలు చేస్తాయి' అని మృదువుగా ప్రేమతో అన్నాడు.

జీన్ వాల్జియన్ కన్నెత్తి చూసినచూపు, భావం, మానవభాష లేవీకూడా వ్యక్తపరచలేవు.

పోలీసు. 'అయ్యా! అయితే ఇతను చెప్పింది నిజమేనా? ఈ వెండిపళ్ళెం పట్టుకొని పరుగెత్తుతుంటే మేం పట్టుకొని ఎక్కడిదని అడిగితే—'

'రాత్రి ఒక ముసలిపీనుగు ఇచ్చాడని చెప్పాడుగదూ! అతను చెప్పింది సత్యమే మీదే పొరపాటు'

'అయితే ఇతన్ని వదిలేయవచ్చునాండి!'

'తప్పకుండా'

పోలీసు లతన్ని వదిలేశారు.

'నన్ను వదిలేసినట్టేనా!' జీన్ వాల్జియన్ విస్మయంగా అడిగాడు.

'వదిలామని తెలీటంల్లే?' అన్నాడు కటువుగా పోలీసు.

"నాయనా! వెళ్ళేలోపలనే వెండిసెమ్మాలనుకూడా తీసుకుపో" బిషప్పు వెండిసెమ్మాలు రెండూ తెచ్చి జీన్ వాల్జియన్ చేతిలో పెట్టాడు. జీన్ వాల్జియన్ ఒళ్ళంతా వణికిపోతున్నాడు. దిగ్భ్రమతో అల్లాగే అవి పట్టుకొని నిలుచున్నాడు.

బిషప్పుతని దగ్గరకుపోయి నెమ్మదిగా అన్నాడు—

'ఈ విత్తం సన్మార్గంలో ప్రవర్తించటాని కుపయోగిస్తానని నాకు మాట యిచ్చావు. మరచిపోవద్దు'

జీన్ వాల్జియన్ కేమాటా యిచ్చినట్లు జ్ఞాపకంలేదు. అల్లాగే నిశ్చలంగా నిలబడ్డాడు. బిషప్పు గంభీరంగా సందేశించాడు.

'జీన్ వాల్జియన్, సోదరా! ఇకనుంచి నువ్వు పాపానికి చెందవు. పుణ్యాని కధీనుడవు. నీ ఆత్మ నీవద్దనుంచి నే కొన్నాను. పాపచింతనలనుంచి, నరకమార్గాన్నుంచి తొలగించి ఆ ఆత్మను, దైవాని కర్పిస్తున్నాను.'

# ౮ వ ప్రకరణము

జీన్ వాల్జియన్ పారిపోతూన్న వాడిలా ఊరు వదిలాడు. కాలి కందిన బాట, కనబడ్డ పుంతల్లా తొక్కాడు. పొలాలన్నీ గిర గిరా గిరగిరా తిరిగాడు. ప్రొద్దుణ్ణించి తిరిగాడు. తిండి లేదు. అకలిలేదు. తిరిగినచోటే తిరుగుతున్నాడు. అనేక నూతన భావాలు ఒక్కసారిగా అతన్ని ముట్టడించ సాగాయి. తనలో ఏమవుతోందో తనకు తెలియదు. తను చిన్నతనం పట్టాడా! తనలో మార్పు జరుగుతోందా! ఏమో! తను లోకంవల్ల పడ్డ భంగపాటుకై తనలో ఏర్పడ్డ భావసంచయం, నిశ్చల ద్వేషం, అన్నీ ఒక్కసారిగా సూకటివేళ్ళతో కదిలించబడుతూన్నట్లు తెలిసికొని కంగారుపడ్డాడు.*ఇల్లాంటిస్థితికంటె, జైలులో పోలీసుల మధ్యఉండటమే నయమనిపించింది. ఆపొదలు, ఆ పువ్వులు, బాల్యాన్ని జ్ఞప్తికి తెలుస్తున్నాయి. అల్లాంటి

*ఆద్వేషాన్ని వదులుకోటాని కతని కిష్టంలేదు.

మృదుభావాలతనిలో కలిసి చాలా ఏళ్ళయింది. ఇప్పుడవి అతను భరించలేకపోయాడు. రోజంతా ఇల్లా కల్లోలంలోనే తిరుగుతున్నాడు.

సూర్యాస్తమయానికి వాల్జియన్ నిర్జనమైన ఒక పెద్ద బయలులో ఒకపొదచాటున కూర్చున్నాడు. ఎదురుగా దూరాన్న పర్వతపంక్తులుతప్ప ఏమీ కనుపడటంలేదు. అతనల్లాగే తపంలోవున్నట్టు కూర్చున్నాడు. అతనిమనస్సులో జరుగుతూన్న భీకరసంగ్రామం అతనిముఖంలో కనబడుతూంది. ఈ ఘోరయుద్ధంలో కిలకిలమని నవ్వువినపడ్డది.

పొదకిప్రక్కనే కాలిబాట ఒకటుంది. బాటవెంబడి శావొయార్డ్ బాలుడొకడు పాటపాడుతూ, నవ్వుకొంటూ, పోతున్నాడు. మధ్యమధ్య చేతిలో నాణాలు ఎగరేసుకొంటూ, ఆడుకొంటున్నాడు. పొదప్రక్కకివచ్చి, నాణాలు ఎగరవేశాడు. ఒకరెండుఫ్రాంకుల నాణెందొర్లివచ్చి జీన్‌వాల్జియన్ ప్రక్కచేపడింది. అప్రియత్నంగా జీన్‌వాల్జియన్ తనపాదం దానిపై వేశాడు. బాలుడునాణెంవంక చూస్తూండబట్టి వాల్జియన్ కాలువేయటం చూసి దగ్గరకువచ్చాడు. నిర్జనప్రదేశం. సంధ్యారాగం బాలుని కేశాలను పసిడివర్ణంలో ముంచెత్తింది. ఆసంధ్యారాగమే వాల్జియన్‌ముఖాన్ని రక్తవర్ణమొనర్చింది.

కుఱ్ఱతనంతో "అయ్యో నాడబ్బు" అన్నాడుబాలుడు.
"నీ పేరు?"

'చిన జెర్వే అండి!

'అవతలికి పో!'

'దయవుంచి నా డబ్బియ్యండయ్యా!'

జీన్ వాల్జియన్ తలవాల్చాడు. మాట్లాడలేదు.

కుర్రాడు ఏడుస్తూ 'నా వెండిడబ్బు, నాది, నాడబ్బు'

జీన్ వాల్జియన్ విన్నట్టు లేదు. బాలు డతని చొక్కా పట్టి లాగుతూ, అతనికాలు కదల్చటానికి ప్రయత్నించుతూ 'నా డబ్బు' అని ఏడవసాగాడు.

జీన్ వాల్జియన్ కన్నుల మైకం యింకా వదలలేదు. కుఱ్ఱవాడు లాగినప్పుడు వింతగా అతనివంకచూసి 'ఎవరిది' అని కఱ్ఱమీందికి చెయ్యి పోనిచ్చాడు.

'నేనండి! చినజెర్వేని, మీకాలు తీయండి నా డబ్బు నాకియ్యండి' అంటూ బాలుడైనా కోపంతెచ్చుకొని 'ఊ! కాలు తీసి నాడబ్బిస్తావా యియ్యవా?' అని గద్దించాడు.

"ఇంకా నువ్వేనా!" అంటూ జీన్ వాల్జియన్ ఒక్క ఉదుటున లేచాడు. బాలు డాపాదమస్తకం వణికి పోయాడు. వణుకు తీరేలోగా ధైర్యం తెచ్చుకొని పరుగెత్తటం మొదలు పెట్టాడు. ఏడవటానికిగాని, వెనక్కి చూడటానికిగాని అతనికి ధైర్యంచాలలేదు. చాలివచ్చి ఒకసారి ఆగినప్పుడు మాత్రం అతను వెక్కి ఏడ్వటం, జీన్‌వాల్జియన్‌కు కలలో లాగ వినపడింది.

అనతికాలంలో బాలుడు దృష్టిపథం దాటిపోయాడు. సూర్యుడుకు గ్రుంకిపోయాడు. జీక్ వాల్జియర్ చుట్టూ చీకట్లుకమ్ముకొస్తున్నాయి. బాలుడు వెళ్ళినప్పటినుంచీ కదలకుండా అతనల్లాగే నిలబడ్డాడు. మధ్యమధ్య దీర్ఘనిశ్వాసం అతనిరొమ్మును కదిలిస్తోంది. తీవ్రంగా పరీక్షించుతున్నట్లుగా అతనిదృష్టి పదిపన్నెండడుగుల దూరాన్ని గడ్డిలో ఒకచిల్లపెంకుపై నిలిచింది. అతను పొద్దుటినుంచి తిండితినలేదు. బహుశా జ్వరంకూడా తీవ్రంగావచ్చిందేమో.

చటుక్కున కదిలి, అతను కోటుగుండీలు పెట్టుకొన్నాడు. ఒక శీతగాలి అతన్ని జాగ్రదావస్థలోకి తెచ్చింది. ఒకఅడుగు కదిలి చేతికఱ్ఱ తీసుకొనేందుకు వంగాడు. కాలుకదపగానే రాళ్ళల్లో మెరుస్తూ, 2ఫ్రాంకుల నాణెం కనిపించింది మెరుపుదెబ్బకులాగా అతని నరాలు చలించి పోయాయి.

ఇదేమిటంటూ మూడడుగులు వెనక్కుపడ్డాడు.

ఆ అంధకారంలో శివుడి నేత్రంలాగ, ఆనాణెం మెరుస్తూ అతనివంక దోషం అరోపించి చూస్తున్నట్లుగా వుంది. అతను దృష్టి దాన్నుంచి మరల్చుకో లేకపోయాడు. ఉండి,ఉండి, హటాత్తుగా ఆనాణెం తీసి గట్టిగా పిడికిటబట్టి, బాలుడు పోయిన దిక్కున ముప్ఫైఅడుగులు పరుగెత్తాడు. అంతలో ఆగి, నలుదిక్కులా కలియచూచాడు. నిరామయం—

బలంకొద్దీ ఎలుగెత్తి "చినజెర్వే! చినజెర్వే!" అనిఅరిచాడు. నిశ్శబ్దం. అతని దృష్టి ఆనిర్జనప్రదేశంలో అంధకారంలో

అంతరించింది. ఆనిశ్శబ్దంలో అతనికంఠం మునిగిపోయింది. శీత వాయువు చుట్టుపట్ల ప్రకృతికోక శోకరూపాన్నా పాదించింది. ఎవరో్ని తరుము తూన్నట్టుగా పొదలకొమ్మలు గాలికి భీకరంగా అల్లల్లాడుతున్నాయి.

కొంతదూరం నడిచి అతను పరుగు నాగించాడు. మధ్య మధ్య ఆగి, ఊహాతీతమైన ఆవేదనతో నిండిన ఎలుగుతో "చిన జెర్వ్ — చినజెర్వ్!" అని అరిచేవాడు. ఒకవేళ బాలుడు విన్నా రాకపోను. కొంతదూరం పోయాక అశ్వారూఢుడై వస్తున్న ఒక పీస్టుఎదురుపడ్డాడు.

"ప్రీస్టుగారు! ఈత్రోవను కుజ్జివాడెవరైనా పోతూంటే చూశారా?"

'లేదు'

'చినజెర్వ్ అనే బాలుడు'

'లేదు'

ఖైదీ రెండు పౌండునాణాలు ప్రీస్టుచేతిలో పెట్టి 'అయ్యా ఇదిగో మీబీదలకు యియ్యండి. ఆ కుజ్జివాడికి పదేళ్ళుంటాయి. శావాయూర్డు లాగున్నాడు.'

'నేను చూడలేదు.'

'మీఊళ్ళో చినజెర్వ్ అనే కుజ్జివాడు లేడా'?

'లేదు'

జీన్ వాల్జియన్ ఆత్రంతో ఇంకో రెండు ఫ్రాంకుల నాణాలు తీసి అతని చేతిలో పెట్టి—

'బీదల కియ్యండి' అని వికృతంగా 'క్రీస్తుగారూ! నేను గజ దొంగను, నన్ను ఖైదు చేయించండి' అన్నాడు.

క్రీస్తు ఐపు లేకుండా ఉడాయించాడు. జీన్ వాల్జియన్ మొదటి తోవనే పరుగుపెట్టాడు. చాలా దూరం కేకలు పెడుతూ కలయచూసుకుంటూ చప్పట్లుచరుచుకుంటూ పోయాడు. ఎవరూ కనబడలేదు. రెండు మూడుసార్లు దూరాన్న శాలువలాగ కనబడితే అటు పరుగెత్తాడు. పొదలు, రాళ్ళు. చివరకి మూడు త్రోవల మొగకొచ్చి ఆగాడు. తుదిసారిగా ఎలుగెత్తి యావచ్ఛక్తితో 'చినజెర్వే—చినజెర్వే' అని అరిచాడు. ఆమూచులో శబ్దం లీనమైపోయింది. హీనస్వరంతో తుదిప్రాణంతోలాగ 'చినజెర్వే చినజెర్వే' అని గొణిగాడు. శక్తి క్షీణించిపోయింది. అంతరాత్మ ఘోరాకారంతో అతన్ని క్రూరంగా తోస్తున్నట్లు అతని మోకాళ్ళు పట్టుసడిలాయి. తొట్రిల్లుతూ పెద్దరాతిమీద పడిపోయాడు. తల మోకాళ్ళమీద వ్రాలింది. చేతులతో జుట్టుపీక్కుంటూ 'నే దురాత్ముడనని' గీపెట్టాడు.

అతని గుండె కరిగిపోయింది. కన్నులశ్రువులు కురిసేస్తున్నాయి. పందొమ్మిదేళ్ళ ఈమధ్య కన్నీటికదే మొదటిసారి.

# ౫వ ప్రకరణము

పారిస్‌లో చదువుకు వచ్చిన నలుగురు విద్యార్థులు నలుగురు యువతులని చేరదీశారు. చదువుల కాలం అయిపోయింది. విద్యార్థులు ప్రపంచజ్ఞానం కలవాళ్ళు. ముందు ముందు వృద్ధిలోకి రావలసిన వాళ్ళకి ఈ లాంపట్యాలు పనికిరావు. ఒకే నాడు నలుగురు విద్యార్థులూ యువతులకు ఆరా చెప్పకుండా మాయమయ్యారు. పెద్దవాళ్ళు ముగ్గురు యువతులూ విషయం గ్రహించి నవ్వుకొన్నారు. వాళ్ళకీ వృత్తి కొత్త కనుకనా!

ఫాంటైన్ అందరిలోకి చిన్నది. అందుచేత తన ప్రియుడు తన్ని వదిలిపెట్టి పోయాడంటే ముందు నమ్మలేక పోయింది.

ఫాంటైన్‌కి ప్రేమాంకురాని కదే మొదటిసారి. తక్కిన ముగ్గురు యువతులతో యువకులందరూ సరసాలాడేవారు. ఫాంటైన్ని ఆమె ప్రియుడు తప్ప తక్కినవాళ్ళెవ్వరూ కదిపే వారు కారు.

ఫాంక్లైన్ సంఘం అట్టడుగున పెనుచీకటిలో జన్మించింది. 'దిక్కులేని పిల్ల' అని ఆమె మొగాన్న మూడుమూర్తులా, వ్రాసివుంది. తలిదండ్రులెవరు? ఎవరెరుగుదురు! త్రోవ ను పోతూ ఎవరో మొట్టమొదటిసారి ఆ పిల్లను ఫాంక్లైన్ అన్నారు. ఆపేరే ఆమెకంకితమైపోయింది. పదోఏట ఫాంక్లైన్ తను పుట్టిన మ——పురం వదిలి చుట్టుపల్లెలలో కూలి జీవనం చేసుకొనేది. పారిస్‌లో ధనమార్జించుకొందామని అక్కడకు పోయింది.

ఫాంక్లైన్ చాలఅందమైనపిల్ల. ఉన్నఆస్తి, నోటిలో ముత్యాలు. తలపై బంగారు చాలులు.

ఫాంక్లైన్ కష్టించి తన పొట్టపోసుకొనేది.

హృదయానికి మాత్రం ఆకలిలేదా!

ఆయువకుడికి ప్రేమ, చెరలాటం. ఆమెకు ప్రేమ జీవం. ఆనందంతో తన సర్వస్వాన్నతని కర్పించింది. ఒక గమ్మత్తు చూపిస్తానంటూ. ఆ ఆనందమధ్యంలో ఒకనాడతను పరారయాడు. ఈగమ్మత్తుతో ఆమె చెదిరిపోయింది. పతిలాగ అతన్ని చూచుకొంది. కన్నీళ్ళతో ఆమె శిశువుమూర్ధం తడిసిపోయింది.

## 2

రెండున్నర ఏళ్ళ బిడ్డను చంకనెత్తుకొని మూపున చిన్ని మూటతో ఒకపడుచు మాంట్ ఫెర్మీల్‌లో ఉన్న ఒక ఇణ దగ్గరకు వచ్చింది. ఇణ గుమ్మంలో ఒక విరిగిపోయిన బండి రోడ్డుకడ్డంగా పడివుంది. ఆ బండిదగ్గిర ఇద్దరు పిల్లల్నాడిస్తో

ఒక నడివయస్సులో ఉన్న స్త్రీ పాటపాడుతోంది. అవటానికి మోటుమనిషి, వికారిఅయినా, మాతృత్వం, ఆమె రూపానికా నిముషాన కొంతమార్దవం ఇచ్చింది. తన వైపువచ్చిన కొత్త పడుచు నింకా చూడలేదు.

"చక్కని బిడ్డ లిద్దరమ్మా నీకు". ఆ పడుచు చేతుల్లో బిడ్డ నిద్ర పోతూంది. తలకు పూలుటోపి, కాళ్ళకు మేజోళ్ళు, ఫ్లానలు చొక్కాతో ఆబిడ్డ తల్లి అంకంలో హాయిగా నిద్రపోతూంది. పాలమిసిమి ఒళ్ళు, కొరికేయాలనిపించే బుగ్గలు,

పడుచుతల్లి ముఖం విచారంతో కూడుకొంది. పాతకజాతి దుస్తులు. యౌవనములోనే ఉంది. అందమా! దుస్తు లామె అందం కొంత కప్పేశాయి. నవ్వితే ముత్యాల పలు వరస కనుపడుతుందేమో! నవ్వదు. తలచుట్టూచుట్టిన రుమా లులో కేశవర్ణం కనపడటంలేదు.

తన బిడ్డలని పొగిడితే రాక్షసి అయినా మెత్తబడుతుంది. ఆ స్త్రీ తలఎత్తి చూచింది. సంభాషణ సాగింది.

'నాపేరు మేడంథెనార్డీర్. ఈ హోటలు పెట్టుకొంటాం'

మేడమ్ థెనార్డీర్ పల్చని మనిషి, ఎఱ్ఱజుట్టు వికృత రూపం కళ్ళు నిద్రపోతూన్నట్టుంటాయి కూర్చొని ఉంది, కాని నిల్చున్నట్లయితే, ఆమెపొడుగు ఆకారంచూసి, హడలిపోయే దేమో! చరిత్రకూడా మారేది, ఎంతస్వల్పంమీద భవిష్య త్తాధారపడి ఉందో! మనిషి నిల్చుంటే ఒకటి. కూర్చుంటే ఇంకొకటి భవిష్యత్తు!

ఆగంతుకురాలు తన విషాద చరిత అవనతవదనంతో చెప్పింది. ఆమె భర్త పోయాడు. పారిస్‌లో జీవనం గడవక జన్మస్థానానికి జీవనానికై పోతూంది. పొద్దుటనుంచీ పారిస్ నుంచే నడిచివస్తోంది. పిల్ల నిద్రపోయింది అంటూ ఆప్యాయంగా ఆ పిల్లను గట్టిగా ముద్దుపెట్టుకొంది. పిల్ల మేల్కొని తల్లి చేతుల్లోంచి జారి ఈడుపిల్లల దగ్గిర చేరి ఆడుకోసాగింది.

'ముగ్గురూ ఆడుకోండంది' పిల్లలతల్లి, అని

'నీ పిల్ల పేరేమిట'ని అడిగింది.

'కాజెట్టి'

'వయస్సు'

'మూడో ఏడువస్తుంది'

'సరిగ్గా మా పెద్దపిల్ల యీడు'

పిల్లలు కలసిపోయి ఆడుకొంటున్నారు. 'పిల్లలెంత త్వరితంగా కలిసిపోతారో' అంది థెనార్డిర్.

పడుచుతల్లి ఈ మాటకోసం ఎదురు చూస్తోంది.

'అమ్మా! నా పిల్లని వెంటతీసుకొనిపోతే నాకు పనిదొరకటం కష్టం దైవం నన్ను నీవాకిట నడిపించాడు. తల్లీ! దయఉంచి నా బిడ్డనుకూడా నీ పిల్లలతో పాటు సాకుతావా? దయగల తల్లివి నీ ఋణం జన్మజన్మాల తీర్చుకోలేను. ముగ్గురు అప్ప చెల్లెళ్ళ లాగుంటారు. త్వరలోనే నే తిరిగివస్తా. అన్నాళ్ళు నాబిడ్డను సాకుతావా.

'చూస్తాం' అంది థెనార్డిర్.

‘ నెల కావుఫ్రాంకులు ఇచ్చుకొంటాను. ’

వెనుకనుంచి పురుషస్వరం—

‘ ఏడు ఫ్రాంకులకు తక్కువకు వీల్లేదు. ఆర్నెల్ల డబ్బుముం దియ్యాలి.’

‘ఆరేళ్ళు నలభై రెండు’ అంది ఇంటి యిల్లాలు.

‘ఇచ్చుకొంటానండీ !

‘పైఖర్చులకు పదిహేను ఫ్రాంకులు’ అన్నాడు యజమాని.

‘ మొత్తం ఏభై ఏడు ’ అంది ఇల్లాలు.

‘ ఇచ్చుకుంటానండీ ’ నా దగ్గిర ఎనభై ఫ్రాంకు లున్నాయి. మిగిలింది దారిబత్తాలకు చాలుతుంది. జీవనం ఆఊళ్ళో చూచుకుంటాను. కొద్దిగా డబ్బు చేరగానే వచ్చి నాబిడ్డను తీసుకుపోతాను. ’

పిల్లకు బట్టలున్నాయా ?

‘ మా ఆయనే ’ అని పురుషుణ్ణి పరిచితుణ్ణి చేసింది, మేడమ్ థెనార్డీరు.

‘ ఉన్నాయండి. మంచిమంచివన్నీ ఉన్నాయి. సిల్కువి ప్లానలువీ మంచిమంచి వే ’

‘ అవన్నీ యిల్లా యియ్యాలి ’

‘ తప్పకుండా ఇస్తానండీ. నా పిల్లకు బట్టలు లేకుండా చేస్తానా.........!’

ఫాంటైన్ బిడ్డ నప్పగించి, హృదయాన్ని పగిలించుకొని వస్తూన్న కన్నీళ్ళతో ప్రయాణం సాగించింది.

# ౬ వ ప్రకరణము

1815 సం॥రం చివరరోజుల్లో ఒకనాడు మ—పురంలో ఇళ్ళంటుకున్నాయి. చుట్టుప్రక్కలజనం భీతితో పరుగులెత్తటం తప్ప ఒకళ్ళూ సరియైన సాయం చేయలేకపోయారు. అగ్నిజ్వాలలు రగిలిపోతున్నాయి.

జీర్ణవస్త్రధారి, ధూళిధూసరితాంగుడు, బలిష్ఠకాయుడు, నడివయస్కుడు, జ్యేష్ఠాదేవి పుత్రుడు ఆగంతుకుడొక్కడు బుజాన్నున్న చిన్నమూట, కఱ్ఱ అక్కడపెట్టి అగ్గిలోకురికాడు. పోలీస్ కమీషనర్ గారి పిల్లలిద్దరి ప్రాణాలకు తనప్రాణం అడ్డువేసి వాళ్ళను బైటికి తీసుకువచ్చాడు. తక్కినవాళ్ళప్పుడతనితో కలిసి మంటలార్పడానికి తయారయ్యారు. ఆసాహస కృత్యానికి పట్టణమంతా అతన్నామోదించారు. ఏ ఊరు? ఏ దేశం? ఏంపనని ఎవరూ అడగలా. అతని ప్యాసుపోర్టైనా చూడలేదు.

అతనాఊళ్ళో స్థిరపడి లక్క గాజులు నల్లపూసల వ్యాపారం సాగించాడు. మ—పురం మొదటినుంచీ గాజులకుప్రశస్తి కాని ఖరీదెక్కువగా ఉండేది. ఆగంతుకుడు లక్కఉపయోగిస్తే గాజులు చవుకగా తయారుచేయవచ్చునని కనిపెట్టాడు. లోహము అతకకుండా వంచటంసులువని తేల్చుకున్నాడు. ఈరెండు చిన్న వ్యాపార సూత్రాలవల్ల ఆభరణాలధర ఎన్నోపాళ్ళుగా తగ్గిపోయింది. వ్యాపారంలో క్రొత్తమార్పువచ్చింది. చవుకగా ముడివస్తువు దొరుకుతుంది. అందువల్ల సరుకెంత చవుకగాఅమ్మినా మునుపటికంటె లాభం ఎక్కువవస్తుంది. కాన కూలిహెచ్చించటానికి వీలుకలిగింది. ఊరిపేదలకుభుక్తి, వస్తువు కొనేవాళ్ళకుచవుక, వ్యాపారానికివృద్ధి—యజమానీ బాగుపడ్డాడు.

అతనిస్థితి నానాటికి వృద్ధిపొందింది. మూడేళ్ళలో అతను భాగ్యవంతుడయ్యాడు. అంతకన్నా అఊరిభాగ్యం ఇనుమడింపజేశాడు. మ—పురం ఈ ఉత్పత్తివల్ల వ్యాపారకేంద్రమయింది. బెర్లిన్‌తోటీ, లండన్‌తోటి సరిసమానంగా పోటీ సాగించింది.

మేడలేన్—ఆగంతుకుడు తనపేరు మేడలేన్ అని చెప్పుకొన్నాడు—వ్యాపారంలో నానాటికి ఆదాయం ఎక్కువయింది. రెండోయేడుదాటాక అతనొక పెద్దఫ్యాక్టరీ కట్టాడు. ఆఫ్యాక్టరీలో స్త్రీలకువేరు పురుషులకువేరు. రెండు కర్మాగారాలు కట్టించాడు. అతనికి కావలసినదల్లా పురుషులలో సద్వర్తనం స్త్రీలలోశీలం. సర్వత్రసౌజన్యం.

పురుషులకు స్త్రీలకు వేర్వేరు కర్మాగారాలు పెట్టించాడు, స్త్రీలశీలం చెడగొట్టకుండా ఉండడానికి. ఆవిషయంలో తథా వతుల నతనేమాత్రం ఒప్పుకోడు. అతనువహించిన తీవ్రతలో కూడా కొంతన్యాయం లేకపోలేదు. మ—పురం సైనికస్థానం. అల్లాంటి ప్రదేశాలలో సామాన్యంగా అవినీతికి తావు మెక్కువ.

మేగలేన్ రాకపూర్వం ఆఊళ్ళో నిరుద్యోగసమస్య ఎక్కువగా ఉండేది. అతనిరాకతర్వాత సోమరిఅనేవాడులేడు. స్తబ్దత్వం, దౌర్భాగ్యంలో మునిగిఉండే ఆఊరు ఆపేర్లమర్చిపోయింది. ఆనాటినుంచీ ఆఊళ్ళో కాస్తోకూస్తో తిండికిలేనివాడులేడు. ఆనందంపొందని కొంపలేదు.

ఆఊరిని సజీవంగాచేశాడు మేడలిన్. కానిఇంతలాభం పొందుతున్నా ఇంత సుభిక్షంమధ్యఉన్నా అతనిదృష్టి వ్యాపారం మీాద లాభంమీాద ఉండేదికాదు. స్వార్థంకన్న పరార్థం అతనిలో ఎక్కువగాఉండేది. 1820 నాటికి (ఐదేళ్ళలో) అతని పేర బ్యాంకులో 630,000 ఫ్రాంకులున్నాయి. ఈఅదా అయ్యేటప్పటికి అతను పదిలక్షల ఫ్రాంకులకుపైగా ఆఊరికోసమని పేదలకోసమని వినియోగించాడు. ఊరి ఆసుపత్రిని వృద్ధిపొందించి ఎక్కువమంది రోగులకు వీలుగాకట్టించాడు. మ— పురం మెగువఊరు, దిగువఊరు అని రెండుపేటలుగా ఉండేది. అతను దిగువపేటలో ఉండేవాడు. అతనున్నది బీదల పేట. ఆపేటలో పిల్లలచదువుకొక పాడుగోడల చిన్నబడి ఉండేది. ఆడపిల్లలకొకటి. మొగపిల్లలకొకటి రెండు విద్యాల

యాలు కట్టించాడు. అందులో పంతుళ్ళకు సర్కారుజీతంపైన తాను రెండింతలిచ్చేవాడు. రాజ్యాంగాని కాటపట్టులు రెండు, ఆచార్యుడు, వైద్యుడు.

స్వంతంగా అతను వేరేఆసుపత్రి కట్టించాడు. పంగ్లాంధ వృద్ధ పేదసాదల పోషణకొక శాశ్వతనిధి యేర్పరచాడు. అతని ఫ్యాక్టరీచుట్టు కార్మికులపేట యేర్పడ్డది. అక్కడ ఉచితవైద్య శాల ఒకటినిర్మించాడు.

కొందరు 'పుణ్యాత్ము' లతన్నిచూసి మొదటిరోజుల్లో ధనార్జన కే వచ్చాడన్నారు. తనకన్నాముందు పురాన్ని సౌభాగ్య వంతం చేసేటప్పటికి ఇతనిలో జిగీష ఎక్కువన్నారు. 1819లో ప్రభుత్వం అతన్ని మ— పురం మేయరుపదవి స్వీకరించమని కోరింది. మేంచెప్పలే! అధికారతృష్ణచేతనే ఈ నటనంతా! మహారాజుగారు అతడుకనిపెట్టిన పరిశ్రమా విధానాన్నభి నందించి గౌరవబిరుదంఇచ్చారు. 'అదేసంగతి' అన్నారు. జనంలోపుణ్యాత్ములు. పదవీ, బిరుదం, రెండూ నమ్రతతో నిరాకరించాడు మేడలేన్. పుణ్యాత్ముల కీవ్యక్తి సమస్య అయిపోయాడు.

నిజానికాపురం అతనికి చాలానచ్చిఉంది. ముఖ్యంగా పాటక జనం. అతనుజనంలో మర్యాదఅందకుండా యెల్లాఉంటాడు? జనం అతన్ని ప్రేమించకుండా యెలావుండగలరు?
కొంచెం ధనంచేరగానే ధనికులతనికి సలాములు చేయసాగారు. తమసంఘంలో చేర్చుకోటానికి వన్నెలు చిన్నెలుచూపి అత

న్ననేకవిధాల భ్రమపెట్టారు. అతనువాళ్ళతో చేరలే. "సం స్కృతం లేనిశుంఠ. అందుచేతే నాగరసంఘంలోకి రావటం లేద"ని అపహాసించి వాళ్ళు తమఉడుకు నెళ్ళబోసుకున్నారు. ప్రజంతా కోరటంచేత ప్రభువు మళ్ళీఅతన్నే రెండవసారి మేయరుగా నియమించాడు. అతనుమళ్ళీ నిరాకరించాడు. కాని ఊరిపెద్ద ఒప్పుకోలే. చాలామంది అక్కడ గుమిగూడారు. అంతా ఐక్యకంఠంతో అతన్ని వేడుకున్నారు. అత నొప్పుకోలేదు. నలుప్రక్కల ఒత్తిడెక్కువైంది. ఒకవృద్ధ పేదరాలు అతన్ని కోప్పడింది. "తను నిర్వహించగల ధర్మా నికి పురుషుడెప్పుడూ వెన్నియరాదు. ప్రజలకు సత్పురుషుడు మేయరుగా ఉండడం అవసరం" అంది. ఆపేదరాలి మందలింపు అతన్నొప్పించింది. మేడర్లేన్ ఆవేళనుంచీ మేయరుగార య్యాడు.

## 2

మేడర్లేన్ ఆఊరొచ్చిన మొదటినాడెలా ఉన్నాడో తుది దాకా అదేవిధంగా యేమార్పూలేకుండా జీవనం గడిపాడు. అతని వెంట్రుకలు కొంత తెల్లవాసినిపడ్డయి. అతనిలో లక్ష ణాలన్నీ కార్మికుడివి. ముఖం దేహాకృపిసిల్ల బ్రతికేవానికి వలె వన్నెతగ్గింది. కాని కన్నులలోను, ముఖంలోవున్న శాంతంలోను వేదాంతిలక్షణాలు గోచరిస్తుంటాయి.
మేయరు పనులుచూసుకోటం మినహా, అతను సామాన్యంగా ఏకాంతంగా జీవనంగడిపేవాడు. అతనుచాలా ముక్తసరిగా ఉండేవాడు. చిరునవ్వే అతను ఎక్కువసంతోషం కనపరచ టం.

పొలాల్లో తిరగట మతనికి సరదా. ఇంకో వ్యావృత్తి చదువు. తిండికి కూర్చొన్నప్పుడు ఒక పుస్తకం ముందుపెట్టుకొనే వాడు. ధనాభివృద్ధితో పాటు, కొంతకాలంగ తీరుబడి ఐనప్పుడు, ఆ కాలం చదువు కుపయోగించేవాడు. గ్రంథాలే, అతనికి నమ్మకమైన మిత్రులు. మ—పురం వచ్చాక నానాటికి అతని భావసన్నితం తీరి, వన్నెదాల్చిం దన్నారు జనం.

వాహ్యాళికి పోయేటప్పుడు అతనొక తుపాకి పట్టుకొని పోయే వాడు. సామాన్యంగా పేల్చేవాడుకాడు. కాని, అతనిగురి తప్పటమనేది లేదు. సాధుమృగాలను. పక్షులను అతడెప్పుడూ హింసించలేదు. నడివయస్సు కొద్దిగా దాటినా, యువకుల కన్నా అతని బలం ఎక్కువగా ఉండేది. ఎవరి కవసరం ఉన్నా వెంటనే చేయూత ఒసగేవాడు. పిచ్చిగా విచ్చలవిడి గా పరుగెడుతూన్న ఆంబోతునైనా కొమ్ములు పట్టికొని రా గలిగే వాడు.

అతని జేబులనిండా అరకానులు, పైసలు నిండుగా ఉండేవి. బయలుదేరేటప్పుడు. ఇంటికి వచ్చేటప్పటికి ఖాళీ. పల్లెల్లో నైనాసరే పోతూన్నప్పుడు పిల్లలతన్ని చుట్టూ ముసిరేవారు. అతనొకప్పుడు హాలిక జీవనం గడిపాడేమో, పల్లెల్లో రైతు లకు చాలా ఉపయోగకరమైన సలహాలిచ్చేవాడు. వాళ్ళ వృత్తుల్లోనే. ధాన్యంపురుగు పట్టకుండా వుండాలంటే గాదిలో నేలముందు ఉప్పునీళ్ళతో తడపాలి. కలుపు మొక్కల్లో ధా న్యానికి రిష్టమయిన మొక్కల్నెల్లా మొలవకుండా చెయ్యాలో, మొలుకలబాధ తగ్గించుకోటమెల్లాగో, ఇల్లా అనేక సదుపా పాయాలు చూపించేవాడు.

ముళ్ళపొదలకుకూడా అతను చాలాఉపయోగాలు చూపించే వాడు. సృష్టిలో స్వతహా చెడ్డ మొక్క లేదు. స్వతహా చెడ్డ మనిషిలేడు. దోహదంలో, పెంపకంలోఉంది లోపమంతా, అంతే.

పిల్లలకతనంటే ప్రాణం. వాళ్ళకు కొబ్బరిచిప్పలతోటి, ఈనలతోటీ, గడ్డిపోచలతోటి అనేకవిధములయిన బొమ్మలు చేసి పెట్టేవాడు.

ఆప్తులు కోల్పోయినవాళ్ళతో నిశ్శబ్దంగా అతనూ స్మశానానికి పోయేవాడు. సత్కార్యాలనేకం చేసేవాడు. అవి బైలు పడనీకుండా దాచటానికి అధికశ్రమ పడేవాడు.

బీదవాళ్ళుకొందరు సాయంత్రం ఇళ్ళకొచ్చేటప్పటికి తలుపులు తెరచిఉండేవి. "దొంగ దొంగ" అని లోపలికొచ్చేటప్పటికి యెవరూ ఉండేవారు కారు. బల్లమీంద ఒకబంగారు నాణెంచూసి పేదముఖం వికసించేది దొంగెవరు? మేడలేన్. "ఆనందంతో విరగబడని అదృష్టశాలి, నిగర్వి చూడామణి ఐన ధనికుడు" అని ఆశ్చర్యపోయే వాళ్ళనెన్నోచూసి.

1821 సం॥లో డి— బిషప్పుగారైన మిరియల్ గారు పరమపదించారని పేపర్లలోపడింది. మేడలేన్ మైలపట్టాడు.

కులీనయువతి—ఒకర్తె మేడలేన్ దగ్గరకువచ్చి చనువుగా "మీరు బిషప్పు మిరియల్ గారి బంధువు లనుకుంటాను" అన్నది.

" కాదండమ్మా "

" మరిమీరు నెలపట్లారేం? "

" ఒకప్పుడు వారివద్ద నౌకరుగా ఉండేవాణ్ణి "

యువతి కంగారుపడి వెళ్ళిపోయింది.

మేడలేనా ఒకనాడొక శావుకార్ల్ బాలుడ్ని చూసి అతనికి రెండుఘాంకలిచ్చాడు. నాటినుంచి చాలమంది శావుకార్లు కృతజ్ఞతన్ని యాచించకుండానే డబ్బుతెచ్చుకునే వారు.

3

నానాటి కితన్ని గురించిన అపవాదులు తగ్గిపోయాయి. నానాటికి అతనంటే ప్రేమతో, భక్తితో, గౌరవంతో చూడం టం మొగలుపెట్టారు. పరోక్షాన్న కూడా అతన్ని గురించి చెడ్డమాటలేదు. అతనంటే అనుమానంగాని, ద్వేషంగాని, కక్షగాని యెవరికీలేదు. అతని మధ్యవర్తిత్వమంటే అందరికీ ఒప్పుదలే.

ఒకస్థితి వచ్చినతర్వాత మంచిపేరుకూడా చెడ్డపేరులాగే పాకిపోతుంది. చుట్టుపక్కల గ్రామాదులన్నిటిలో, రాను రాను దూరస్థలాలలోకూడ, అతనికీర్తి ప్రబలమైపోయింది.

కాని— కాని, ఒక్క మనిషినిమాత్రం ఈ అంటువ్యాధి— మేడలేనును గౌరవించడమనే అంటువ్యాధి— సోకలేక పోయింది. అతనిదృక్పథాన్ని వెంటుకవాసి పక్కకు తొలగించలేకపోయింది. ఈప్రబల గౌరవానికతడొక్కడూ మెదు

రు ఒగ్గాడు. అతి జాగ్రత్తతో అతనొక్కడూ పనిశిష్యకుండా అహర్నిశలు ఈవ్యక్తిని కనిపెడుతూనే ఉన్నాడు.

ఇనస్పెక్టరుజావర్టు నొకసారి చూచినవాళ్ళెవరూ అతన్ని మర్చిపోరు. అతని ముఖరేఖ రెప్పుడూ అంతతీవ్రంగానే ఉంటుంది. అతనిచూపు ఎప్పుడూ నిశితమే. మేడలేక కొంత వృద్ధిలోకి వచ్చినతర్వాత అతనికాఉూరు ఉద్యోగమయింది. కొందరుపోలీసుల మొగాలలో అధికారము నైచ్యముకూడా ఒకేసారి మిళితమయి కనబడుతాయి. జావర్టు మొగంలో నైచ్యం శూన్యం.

ప్రతిమానవుని హృద్గమనం విపులంగా తెలిస్తే మృగసంతతిలో ఒకదానికి అతన్ని పోల్చవచ్చునని మాగట్టినమ్మకం. ఇంకో సత్యముకూడా పరికించవచ్చు గుల్లపురుగునుంచి గండభేరుండందాకా పందినుంచి పంచాస్యంవరకూ సర్వ మృగ, పక్షి జాతులూ మానవునిలోఉన్నాయి. ఒక్కొక్కనిలో ఒక్కొక్కటి ప్రత్యేకంగా ఒక్కొక్కచో ఒక్కనిలోనే అనేకమృగ జాతులు మనలోఉన్న వివిధ సాధుత్వ కూరత్వాలు, మంచి చెడ్డలు రూపందాల్చి, మనముందు మృగరూపాల్లో తిరుగుతూంటాయి. మనఆత్మజ్ఞానాభివృద్ధికే సర్వేశ్వరుడు మన ముందు వాటినలా సృష్టించి కనపరుస్తున్నాడు. అద్దంలోలాగా మన చిత్తచర్య మన కళ్ళనపడితే మనం ఆత్మశుద్ధి పొందేందుకు.

ఈసూత్రం ఒప్పుకుంటే జావర్టునింకా తేలికగా అవగాహన మొనర్చుకోవచ్చు. కొన్ని ఆడుతోడేళ్ళ సందల్లో ఒక్కొక్క

ప్పుడు తల్లితోడేలు తన పిల్లలలోని కుక్కపిల్లను చంపుతుం దట. అపిల్ల పెద్దదైతే తనసాటితోడేళ్ళను చంపుతుందని. వేటకుక్కకు తోడేలుకు జన్మించిన ఆకుక్కపిల్లను బాగామన సులో చిత్రించుకోండి. ఆజాగిలానికి మానవరూపం ఇవ్వండి. —జావర్ట్.

జానస్టుజననం కారాగృహంలో. అతనితల్లి సోదెచెప్పేది. తండ్రికి జన్మశిక్ష. సంఘం తన్ని చేర్చుకోదని అతడు నిస్పృహ చెందాడు. సంఘం రెండుతరగతుల జనాన్ని సహించలేదని అతడేనాడో తెలుసుకున్నాడు. సంఘాన్ని రక్షించేవాళ్ళని, సంఘాన్ని భక్షించేవాళ్ళని. జన్మతః తనుచెందిన తరగతికి బుద్ధిచేఅతను చెందలేకపోయాడు. అతనిలో ఆత్మశిక్షణము ధృడనిశ్చయత్వము ధర్మగౌరవము, అతన్ని రక్షకభటశాఖ లో ప్రవేశింపజేశాయి.

అతనినిలువెల్ల రెండేసూత్రాలు. శిష్టత్వానికి గౌరవం, రక్షణము, దుష్టత్వానికి అవమానం, శిక్ష. ఈరెండు చక్కని సూత్రాలు అమితోపయోగంచేత అతనిచేతిలో కొంచెం చెడ్డాయేమో. ధర్మం, అధికారంపట్ల అతనుచూపే గౌర వంలో రవ్వంతైనా అనుమానంగాని, లోపంగానిలేదు. దుష్టశిక్షణలో, అతనిలో కరుణ లేశమాత్రమయినా లేదు, అతనివృత్తి "ధర్మం", అతనిపథం "ధర్మం". కరుణఅనేది. హృదయమనేది, అతని ధర్మవర్తనలోలేదు. నిజానకి "ధర్మము" నకే హృదయంలేదు. మరి అతను సాక్షాత్క రించిన ధర్మదేవత.

రాజ్యాంగము ప్రభుత్వము అంటే అతనికి గుడ్డినమ్మకం. మహారాజునుంచీ డవలా బంట్రోతుదాకా అందరూ అతని దృష్టిలో న్యాయవర్తనులూ, ధర్మమునకు దాసులూ, పూజనీయులూ. ఈనీతికి, ఈధర్మానికి, ఒక్కసారైనాసరే, ఎంత స్వల్పంగానైనాసరే, అపచారం చేసినవాళ్ళంతా అతనిదృష్టిలో అవినీతిపరులు, దుష్టులు సంఘద్రోహులూ, శిక్షార్హులూ. అతని నిఘంటువులో "పరిహారం" 'ప్రాయశ్చిత్తం' అనే వాక్యాలులేవు. కరుణ అతనికి కొత్తేకదా!

'రాజోద్యోగి అధర్మం చేయజాలడు. అవినీతి పరుడు సత్ప్రవర్తనుడు కాలేడు.' ఈ సూత్రానికి భిన్నం అతనెరుగడు. అతని చేతిలోపడ్డ అపచారి తప్పించుకు పోలేడు.

తన పోలీస్ వృత్తి పాలించటంలో జావర్టు కెవరూ అందరు. రాజు తన ధర్మానెల్లా పాలించాలో, జావర్టు తన ధర్మాన్నం త నిశితంగా పాలించేవాడు. అతని ధర్మాచరణం అంత నిష్ఠురం, తీవ్రం. తన తండ్రి జన్మశిక్ష తప్పించుకుపోతే అతన్ని పట్టియిచ్చేవాడే. తనతల్లి ఖైదులోనుంచి పారిపోతే మళ్ళీ ఖైదుచేసేవాడే. అధర్మానికి వ్యక్తిభేదంలేదు. అతని చూపు గ్రద్దచూపుకన్నా నిశితం. తీవ్రం. గూఢచారిత్వమతని నిత్యకృత్యం. వేయికన్నుల కనిపెడుతూ, కావలా కాస్తూంటాడతడు సంఘాన్ని. అతనిది చిత్రిగుప్తుడిచిత్రా. ఆ శిలాస్వరూపంలో హృదయానికి తావెక్కడ.

జావర్టురూపం పోలీసుకి, చారుడికి (spy) తగినరూపం. అతని నుదుటును టోపీకప్పేసేది. కళ్ళని కనుబొమ్మలు కప్పేసేవి.

చుబుకందాకా కోటు. ఆకోటులోపలే చేతులు, చేతిబెత్తం. అతను రంగంలోకి దూకేటప్పటికి అటోపీలోనుంచి నుదురు ముందుకువచ్చేది. కన్నులు తీక్షణంగా చూస్తూ బైల్నడిచూపులతో అన్నిటినీ అరికట్టేసేవి. చేతులొక్కసారిగా చైతన్యమయ్యేవి. చేతిబెత్తం పైనఆడేది.

తీరికెప్పుడైనాఉంటే అతనేదైనా పుస్తకం చదువుకునేవాడు. కాని మొత్తంమీద అతనికి పుస్తకాలంటే ఏవగింపు. అతనికి వ్యసనాలేవీలేవు. ఎప్పుడైనా కాస్తపొడుం పీల్చేవాడు మానవత్వచిహ్నం అదొక్కటే.

జావర్టుపేరుచెప్తే సంఘం అపచారులకు హడల్. అతని ముగం కనబడితే గజదొంగలు నిలువునా నీరైపోయేవాళ్ళు.

4

జావర్టునిత్యం మేడలేన్ నొకకంట కనిపెడుతూనే ఉన్నాడు ఆదృష్టిలో అనుమానాలు, అపోహలు మిళితమయిఉన్నాయి. రానురాను కొన్నాళ్ళకు మేడలేన్ తన్నుజావర్టు అనుమానిస్తూన్నట్లు చూచాయగా గ్రహించాడు. కాని ఈ అల్పవిషయాన్ని లెక్కచేయక తోసుకుతిరిగాడు. కాని ఒకనాడు ఒకచిన్న విషయంలో జావర్టు అతని అరాలోకివచ్చాడు.

ఆనాడు మేడలేన్, ఒకవీధిలో జనంగుంపు చేరివుండటం చూసి అక్కడికిపోయాడు. ఒకవృద్ధుడు బండిఅడుగున పడిపోయాడు. గుఱ్ఱం నేలమీదకూలి నడుమెత్తలేకుండాఉంది. వృద్ధునిపేరు బాపూ ఫాచీవిలెంటు. మేడలేన్ కానాటికి ఇంకా మిగిలిన

శత్రువులలో అతనొకడు. మేడలేన్ ఆఊరు వచ్చేటప్పటికి ఫాషీవిలెంటు చిన్న వర్తకంలో ఉండేవాడు. కులీనుడైన తను వర్తకంలో దివాలాతీస్తున్న రోజుల్లో ఈకూలివాడు వృద్ధి పొంది తనకన్నా భాగ్యవంతుడై ఇంకా పైకిపోవటంచూసి అసూయతో అతనికడుపు మండిపోయింది. మేడలేన్‌ను ఏ రేమే విధంగా నిందపరచవచ్చునో అన్నివిధాల సర్వవేళల ప్రయత్నించేవాడు. అక్కసయినా తీరలేదు. దివాలాతీసి, పూర్వపురోజుల్లోనుంచి మిగిలిన గుఱ్ఱముబండి తోలుకొని జీవనం గడుపుకొంటున్నాడు.

గుఱ్ఱము రెండు కాళ్ళూ విరిగి లేవలేకుండాఉంది. వృద్ధుడు చక్రాలమధ్య నలిగిపోతున్నాడు. బండి బరువంతా అతని గుండెలమీద ఆనింది. బండినిండ సామాను. వేదనతో అత నరుస్తున్నాడు. పైటికిలాగాలని ప్రయత్నిస్తే అతనిస్థితి మరీ యిరకాటమౌతుంది. సహాయమేమాత్రం మొరటుగాచేసినా అతనిప్రాణాలకు మోసం. అడుగునదూరి బండీ ఎత్తుతేతప్ప గత్యంతరంలేదు. అప్పుడే అక్కడకువచ్చిన జావర్ట్ బండి ఎత్తేందుకు పలుగుకోసం పంపించాడు. మేడలేన్‌నుచూసి గుంపు మర్యాదతో అతనికి తోవయిచ్చింది.
ఫాషివిలెంటు అరుస్తున్నాడు. "ముసలాడ్ని రక్షించే ధర్మాత్ములు లేరా?"

మేడలేన్ గుంపువంక తిరిగి "పలుగుఉందా" అని అడిగాడు.
"పంపించారండి"

"ఎంతసేపట్లో వస్తుంది?"

" పావుగంటకు తక్కువపట్టదు "

" పావుగంటే ! మేడలేన్ పెదవి విరిచాడు.

గతరాత్రి వర్షం కురియుటవల్ల నేలమెత్తబడి బండి యింకా లోపలకు కుంగుతోంది.

" పావుగంట ఆగటానికి వీల్లేదు " అన్నాడు మేడలేన్.

" తప్పదు "

" అరె! బండి కుంగిపోతోంది చూడటంలేదా ? "

" ఔను''

" వినండి బండిక్రింద ఇంకా ఒకమనిషిపట్టే సందుంది. బలవంతు లెవళ్ళయినా బండిక్రింద దూరి లేవనెత్తితే అరనిముసంలో వృద్ధుణ్ణి లేవదియ్యొచ్చు. తీసినవాళ్ళ కైదురూపాయలిస్తాను "

ఎవరూ పల్కలే.

" పదిరూపాయ లిస్తాను. "

ఎవళ్ళో గొణిగారు ' చాలా బలండుండాలి. అదీకాకుండా క్రిందపడితే తుక్కైపోవడమే. '

" ఇరవై రూపాయలిస్తా "

నిశ్శబ్దం.

"ధర్మబుద్ధిలోపాన్నకాదు నాళ్ళాగింది"——మేడలేన్ ఆ వంక తిరిగి జావర్టును చూశాడు. " బలం కావలసింది. ఒకబండి

వీపున యెత్తాలంటే సామాన్యపు బలంచాలను" అని మేడ లేన్ వంక తీక్షణంగాచూస్తూ—

మేడలేన్‌గారూ, ఒక్కణ్ణీతప్ప ఇంత కార్యం చెయ్యగలవాణ్ని నేనింతవరకూ ఎవర్నీ చూడలేదు.

మేడలేన్ అదరిపడ్డాడు. దృష్టిమాత్రం మార్చకుండా నిర్లక్ష్యంగా జావర్టు సాగించాడు.

"అతనొక ఓడబానిస (Galley slave)"

"ఉహూ!" మూలిగాడు మేడలేన్.

"టూలన్‌లో"

మేడలేన్ పాలిపోయాడు. బండి అంతకంతకు కృంగిపోతోంది. ఫాషీవిలెంటు మరణరోదనం చేస్తున్నాడు.

"ఎముకలు నలిగిపోతున్నాయి. గుండెలు నొక్కేస్తూంది. వలుగో ఏదో తెండి బాబుల్లాలా"

మేడలేన్ చుట్టూచూశాడు.

"యెవళ్ళకీ డబ్బవసరంలేదా? వృద్ధుణ్ణి రక్షించి యాభై రూపాయలు సంపాదించుకోరాదా?"

జావర్టు మళ్ళీఅన్నాడు.

'ఆ కాన్విక్టుతప్ప ఈబండి యెత్తగలిగిన వాడెవర్నీ నే చూడ లేదు.'

అయ్యో! చంపేస్తోందని అరిచాడు వృద్ధుడు.

మేడలేన్ తలెత్తాడు.

జావర్ట్ డేగచూపు తనమీదే ఉంది. చుట్టూ జనంవంక పరికించి ఒక్కనిట్టూర్పు వదిలాడు.

మారుమాటాడకుండా మోకాళ్ళమీద ఆని బండికిందకు దూరాడు. జనం అరరె అనేందుకుకూడా వ్యవధియియ్యలా. ఆత్రంతో ప్రాణాలు బిగబట్టుకుని జనం నిశ్శబ్దంగా చూస్తున్నారు.

బండికింద పూర్తిగా బోర్లబుక్కులుగా పడుకొని యావచ్ఛక్తితో లేచేందుకు రెండుమార్లు ప్రయత్నించాడు.

పాటకజనం మేడలేన్ బాబూ బైటికిరండని గగ్గోలుపెట్టారు. ఫాషీవిలెంటుకూడా అన్నాడు.

మేడలేన్ గారూ వెళ్ళిపొండి. నేను చావకతప్పదు. మీప్రాణం కూడా పోవటమెందుకు.

మేడలేన్ మాటాడలేదు. చక్రాలింకా కుంగటంచూసి జనం నోళ్ళు వెళ్ళపెట్టారు. మేడలేన్ కూడా బయటకు రావడానికి వీల్లేదు.

ఒక్కసారి ముద్దముద్దాకదిలి, బండిచక్రాలు కొంతపైకివచ్చాయి అడుగునుంచి త్వరగా త్వరగా సాయంచెయ్యాలి. అని మేడలేన్ అరిచాడు. తుదిసారిగా శక్తంతా వినియోగించి అతనామాత్రం యెత్తాడు.

ఒక్కనిత్యాగంతో తక్కినవాళ్ళకు ధైర్యం వచ్చింది. ఆఊపులో నలుగురూచేరి పైకిలాగేశారు.

మేడలేన్ లేచాడు. చెమటకారిపోతూన్న మొగం జీవం ఉట్టి పడుతూఉంది. బట్టలన్నీ బాడీఅయి చిరిగిపోయినవి. ఫాషీవిలెంటు ప్రాణదాతవంటూ అతనిపాదాలు ముద్దెట్టుకొంటూన్నాడు.

మేడలేన్ మొగంలో ఆనందం, వ్యథ వెలుగుతూన్నాయి. తన్నే చూస్తోన్న జావర్టుకేసి మందంగా చూశాడు.



ఫాషీవిలెంటు కాలు విరిగిపోయింది. మేడలేన్ అతన్ని తన కర్మాగారంలోని వికలాంగుల ధర్మశాలలో ప్రవేశపెట్టాడు. విరిగిపోయినబండి, చచ్చిపోయినగుఱ్ఱం అతనిదగ్గర కొన్నట్లుగా అతనికి వేయిఫ్రాంకులిచ్చాడు. ఫాషీవిలెంటు స్వస్థుడయ్యాడు. కాని, కాలుకుంటుపోలేదు. దగ్గరవున్న ఒక నన్నరీ (Nunnery) లో అతనికి తోటమాలిపని యిప్పించాడు.



ఇదయిన కొన్నాళ్ళకే మేడలేన్ మేయరయ్యాడు. ఆవేషం లో అతన్ని చూసేటప్పటికి జావర్టుకు తను తరుముతూన్న తోడేలు తనయజమాని రూపందాల్చి కూర్చుంటే వేటకుక్క కెలాగుంటుందో అలాఅనిపించింది. ఆనాటినుంచి జావర్టతన్ని తప్పించుకుతిరిగాడు. మేయరుతో పనికలిగినప్పుడు విధిలేక వచ్చినట్లుగా పని చూసుకొనేవాడు. అప్పుడుమాత్రం అతనితో అతిగౌరవంతో మెలిగేవాడు.

మేడర్ వచ్చిననాటినుండి మ— పురంలో. లక్ష్మీ సరస్వతులు తాండవమాడుతున్నాయి. జనంలో సౌఖ్యం, సౌబాగ్యము ఇనుమడించాయి. కలతలు తగ్గాయి. సుఖంగా జరిగిపోతూంది. జీవనం చవుకయింది. పన్నులు జనంసంతోషంతో ఇచ్చేవాళ్ళు. మహామంత్రిగారు పోలిక చెప్పాలిసొస్తే ఎప్పుడూ మ— పురాన్ని ఆఊరు మేయరును చెప్పుకొనేవాడు.

# ౭ వ ప్రకరణము

ఫాంటైన్ మ—పురం వచ్చేటప్పటికి ఆఊరిస్థితి పైన చెప్పిన లా ఉంది.

ఆమెనెవరూ గుర్తించలేదు. కాని మేడలేన్ ఫ్యాక్టరీద్వారం ఆమెనాదరణతో పిలిచింది. అక్కడికి వెళ్లగానే ఆమెను స్త్రీల కర్మాగారంలో చేర్చుకున్నారు. పని కొత్తవటంచేత సరిగా చెయ్యలేక ఆమెకు కొద్దిజీతమే ముట్టేది. కాని ఆకొద్దిజీతనే ఆమెసమస్యను పరిష్కారం చేసింది. తనభత్యం తాను సంపాదించుకొంటూంది. ఈ వృత్తి వల్ల న్యాయంగా జీవనముగడప గలిగేటప్పటికి ఫాంటైన్ సంతోషంతో ఉప్పొంగిపోయింది. మర్యాదగా స్వంతకృషిచేత పొట్టపోసుకోవటం యెంత అదృష్టం. పనిఅంటే ఆమెలో మంచి సరదాపుట్టింది. ఒకఅద్దం తెచ్చుకొని అందులో తన యౌవనం అందమైన, తలకట్టు

ముత్యాల పలువరుస చూసుకొని మురిసిపడి అన్నికష్టాలు మరిచిపోయింది. శాస్త్రీ భవిష్యత్తు తలచుకుంటూ ఊహా సౌధాల కట్టుకొంది.

ఒకగది అద్దెకుతీసుకొని బాడుగకు సామానుసర్దుకొంది. వెనుక రోజుల అలసత్వచ్ఛాయ ఇదొకటే మిగిలివుంది.

పెళ్ళయిందని చెప్పుకోటానికి వీలులేకపోబట్టి పిల్లవిషయం యెవరిదగ్గరా తెచ్చేదికాదు. ఫెనార్డ్కు డబ్బు వాయిదా ప్రకారం పంపించేది. కాని వాళ్లకుత్తరాలు రాయాలి. సంతకంతప్ప తనకుచేతరాదు. ఒకలేఖకునిద్వారా ఉత్తరాలు పంపించేది.

షాపులో గుసగుసలు బయలు దేరాయి. ఉత్తరాలు తెగ రాస్తూంది ఏవరికో. ఏదో సాగుతూంది.

ఫాంటైన్ పేరు పదినోళ్ళల్లో పడింది. అసలే ఆమె అందం చూసి తక్కిన స్త్రీకార్మికులు అసూయతో ఉడికిపోయే వాళ్ళు.

ఒక్కొక్కప్పుడామె కనుతుదల ఒక్క బాష్పకణం నిండితే మునిజేతితో తుడుచుకొనేది. బిడ్డకోసమో! ఆనాటి ప్రియుడికోసమో! పాతరోజుల బాధలన్నీ, ఒక్కసారిగా విస్మరించటం ఎంతకష్టం!

ఫాంటైన్ ఎప్పుడూ ఒక్క చిరునామాకే వ్రాసేది. లేఖకుడు ఆమెకు కూతురుందని చల్లచల్లగా బయట పెట్టాడు. ఒక పతివ్రతాతిలకం, డబ్బు ఖర్చుపెట్టుకుని, ఆఊరు వెళ్ళివచ్చి

'నేనుబిక్షను చూచి వచ్చానని నలుగురిలో సగర్వంగా సంతోషంతో చెప్పింది. అట్లాంటి దేవతలే లేకపోతే నాలుగుపాదాలా ధర్మం, నీతి నడుస్తాయూమరి !

ఇదంతా కొంతకాలం పట్టింది. ఒక ఏడాది ఫాంటైన్ ఫ్యాక్టరీలో పనిచేసింది. ఒకనాడు పొద్దున స్త్రీలషాపుమేనేజరు ఆమె చేతికి 50 ఫ్రాంకులిచ్చి, 'మేయరుగారు నిన్ను పనిలోనుంచి తొలగించి నీకీడబ్బిస్తున్నారు. ఈ ఊరు వదిలి వెళ్ళడం నీకు శ్రేయస్కరం' అని చెప్పింది.

ఆనెతే థెనార్డీస్లు, 7 నుంచి 12 ఫ్రాంకులకు హెచ్చించి, 12 చాలవు 15 ఫ్రాంకు లియ్యాలి, పంపమన్నారు.

ఫాంటైన్ తెల్లబోయింది. తనా ఊరు వదిలేందుకు వీలులేదు. ఇంటి అద్దె, సామాను ఖరీదే 50 ఫ్రాంకులు దాటుతాయి. దయచూపమని గోజిగింది. యజమానురాలు తక్షణం పొమ్మన్నది. ఫాంటైన్ పెద్దపనిమంతురాలైనా కాదు.

అవమానంకన్న సిగ్గుతో, నీచతతో కుంగిపోయి తనగది చేరుకుంది. తనతప్పు లోకమంతా యెరుగును.

ఒక్కమాట అనేందుకన్నా ఆమెలో శక్తి లేకపోయింది. ఎవరో మేయరును చూడమన్నారు. కాని ధైర్యంలేకపోయింది. మేయరు దయాళువు అందుకే 50 ఫ్రాంకులిచ్చాడు. న్యాయమూర్తి. అందుకనే వెళ్ళగొట్టాడు. తలబగ్గ ఈన్యాయం స్వీకరించింది.

ఆ దేవతకష్టం వృధాపోయిందా !

ఇదంతా మేడలేన్‌కు తెలియదు. మేడలేన్ ఎప్పుడూ స్త్రీల కర్మాగారంలో అడుగుపెట్టలేదు. తనునమ్మిన నమ్మకమైన ఒకవృద్ధురాలి నాభాగమునకు యజమానురాలుగా నియమించాడు. నిజాని కావిడకూడా చాలా ఉత్తమురాలు. సత్కులీన. న్యాయం, ధర్మం సక్రమంగా జరిపేది. దయాబుద్ధి ఉన్నది. కాని క్షమతక్కువ. మేడలేన్ సర్వ విషయాలలోను ఆమెను నమ్మి అధికారమిచ్చాడు. ఆ నమ్మకంతోటే ఆమె ఫాంటైన్‌ను విచారించి తనకుతోచిన ధర్మంగా 50 ఫ్రాంకులిచ్చి వెడల నడిచింది.

2

ఫాంటైన్ దాసీపనికోసం ఇల్లిల్లూ తిరిగింది. ఊరంకులాడి, (మరి దేవత బైటపెట్టిందిగా!) ఎవరిక్కావాలి? ఊరు వదలటానికి వీల్లేదు, సామానుకు డబ్బియ్యకుండా— 'ఏం సామాను! ఆమనిషి వేగిరపెడుతున్నాడు. "డబ్బియ్యకపోయావా దొంగతనం కేసుపెట్టించి జైలులోవేయిస్తా". అద్దెకు యింటి యజమాని తొందరపెట్టాడు. "పడుచుదానివి ఈఅప్పే తీర్చుకోలేవా" అంటాడు. 50 ఫ్రాంకులూ వాళ్ళిద్దరికీ ఇచ్చేసింది. అవసరమైన ఏఒకటి రెండో తప్ప సామానులన్నీ అతనికప్పచెప్పేసింది. పనిలేదు. వృత్తిలేదు. చేతి రాగిదమ్మిడీలేదు. నూరుఫ్రాంకులు అప్పు.

సైన్యాలకు ముతకచొక్కాలు కుట్టియిచ్చి రోజుకు 6 సోలు సంపాదించేది. కాస్టుకి నాలుగుసోలుఖర్చు. థెనార్డీర్ల దగ్గర

అప్పు పెరగసాగింది. దీపం వెలిగించేందుకు సాయంత్రింపూట వచ్చే ఒకవృద్ధురాలు దారిద్ర్యంలో బ్రతకటం ఆమెకుకొంత నేర్పింది.

స్వల్పంలో జీవించటానికి దిగువ నింకో మెట్టుంది. శూన్యంలో జీవించటం. మొదటిమెట్టున లేజీకటి. క్రిందిమెట్టున పెను జీకటి.

శీతాకాలం చలి కాచుకోకుండా గడపటం ఫాంటైన్ నేర్చుకొంది. ఒకచిన్నచిలుకను పెంచేదిపూర్వం. ఇప్పుడా ఖర్చెందుకు? పగలు చీర, రాత్రి దుప్పటి పరుపూ కంబళీను. దీపం వృథాఖర్చు. ఎదురింటి దీపంవెలుగు తనకిటికీ దగ్గరకు కొంతగా వస్తుంది. అక్కడే పనులుచేసుకోవచ్చు. దరిద్రింలో ఋజువర్తనంతో జీవనంగడిపిన వృద్ధులు కానీకెంత ఉపయోగం చూపగలరో మన కేం తెలుసు. ఆ నేర్పు అలవర్చుకొంది ఫాంటైన్. రోజుకైదుగంటలు నిద్ర. 19గంటలు పనిచేస్తే తిండి ఎల్లప్పుడు సంపాదించుకోవచ్చును. పైగా విచారంగా ఉన్ననాడు ఆకలికూడా ఉండదు. ఇల్లా బ్రతుకలేమా!

ఆరోజుల్లో బిడ్డదగ్గిర ఉంటే కొంతమనశ్శాంతి ఉండేదేమో! ఛా! తనతోపాటు ఈనరకంలో బిడ్డను కష్టపెట్టటమా!

మొదటకొన్నాళ్ళు సిగ్గుతో బైటికిరాలేదు. బైటికి వచ్చినప్పుడంతా వేలెట్టి ఆమెను చూపసాగారు. ఆ నిరసనం, అవమానం. దేహాన్ని, హృదయాన్నికూడా దహించేసేవి. చిన్న ఊళ్ళల్లో ఇవితప్పవు. పారిస్‌లో ఐతే బాగుండేదేమో. దారిద్ర్యానికిలాగే ప్రజానిందకీ నిరసనానికి అలవాటు పడింది.

కొన్నాళ్ళకు అభిమానం చంపుకొని నాకేం లెక్క అనుకొని మళ్ళీ తలెత్తుకొని కష్టహాసంతో బయలుదేరేది. తనలో మూర్ఖత్వము యెక్కువౌతూందని తెలుసు.

ఫాంటైన్ నీస్థితికి తెచ్చిన దేవత, కిటికీదగ్గర వెలుగుకు ఫాంటైన్ చొక్కాలు కుట్టుకుంటూంటే చూసి 'తగినశాస్తి చేశాన'ని సంతోషించుకొనేది. ఆసంతోషం మాత్రంమెం దరికిగాను!

పనియెక్కువ చేయటంతో ఫాంటైన్ నీరసించింది. గొంతుకలో పొడిదగ్గు బయలుదేరి నానాటికి అధోగతికి తెచ్చింది. సాయంత్రమయేటప్పటికి ఒళ్లు మసిలిపోతూ ఉండేది, పని వేడికి.

పొద్దున్నపూట తలదువ్వుకో అద్దం చూచుకొన్నప్పుడు స్త్రీ సహజమైన ఆ స్వల్ప సంతోషంమాత్రం ఇంకామిగిలింది.

శీతాకాలం గడిచింది. వేసవిగడిచింది. మళ్ళీ శీతాకాలం వచ్చింది. పొద్దుతక్కువ. చలి. వెలుగుండదు, పనిచేసుకోటానికి. శీతువుచే నీళ్ళతోపాటు మనుష్యుల గుండెలుకూడా గడ్డకట్టుకుపోయి కఠినంగా మారుతాయి. అప్పులాళ్ళు పీక్కుతినసాగారు. థెనార్డీర్ బెదిరిస్తూ వ్రాస్తున్నాడు. కాసెట్టీకి ఒంటిమీద బట్టలేదు పదిఫ్రాంకులన్నా పంపితేగాని పిల్లను వెళ్ళగొట్టవలసి వస్తుంది.

రాత్రి ఒక సెలూన్‌కి పోయింది. మంగలి ఆమె కురులు చూసి 'ఎంచక్కని జుట్టు!' అన్నాడు.

'ఏమిస్తావు వాళ్లకు?'

'పదిఫ్రాంకులు.'

పదిఫ్రాంకులకు ఫ్లానలు కొనుక్కొని థెనార్డిర్లకు పంపింది. వాళ్ళు మండిపడ్డారు. డబ్బు కావాలిగాని ఈ వెధవగానెవరి క్కావాలి? అయినా గాను వాళ్ళమ్మాయి ఎపినైన్ (Eponine) కిచ్చారు. ఫాన్టైన్‌కి మళ్ళీ చలి వణుకే. 'నా బిడ్డకు చలివెయ్యదు. నా కేశాలతో నాబిడ్డను కప్పాను. ఇక చలివేయదు' అనుకొని సంతోషించుకొంది ఫాన్టైన్. గొరిగిన తల కప్పుతూ ఒక టోపీ పెట్టుకొని తిరిగేది. ఆమె అందం ఇంకా చెడలేదు.

ఫాన్టైన్‌లో రానురాను వికృతమైన మార్పు కలుగసాగింది. ఆమె హృదయంకూడా నైషమ్యంతో నిండసాగింది, ఇన్నాళ్ళు మేడలేన్ అంటే అందరికీలాగే ఆమెకూ మంచిగౌరవ ముండేది. తన జీవనం పడగొట్టి తన్నీ దుస్థితికి తెచ్చాడని మాటిమాటికి జ్ఞప్తికి వచ్చి, అతనిమీద ద్వేషం అంకురించింది. నాటినాటి కాభావం గాఢమయి, మేడలేన్ పేరు చెపితే మండిపోయేటట్టుగా తయారయింది.
ఫ్యాక్టరీ ప్రక్కనుంచి పోతూన్నప్పుడల్లా బింకం తెచ్చుకొని గట్టిగా నవ్వి పాటలుపాడేది. 'చెడిపోతుం దాపిల్ల' అన్నాడొక కూలి.

నిరాశ, అసహ్యం, విద్వేషంతో నిండిన హృదయంతో, పెంకిగా, చేతికి అందిన వాణ్ణొకణ్ణి చేరింది. అతనొక దుర్మా

ర్గుడు, శుంఠ, ఆమెను కొట్టి, తిట్టి, ఎంత అసహ్యంతో ఆమె తన్ను చేరిందో, అంత అసహ్యంతో ఆమెను వదిలేశాడు.

అల్లా కృంగిపోతూన్నకొద్దీ, ఫాంటైన్ హృదయం చీకట్లతో నిండుతూంది. ఆ చీకట్లమధ్య, కాసెట్టీ నక్షత్రంలాగ మెరుస్తూంది. తను క్రుంగినకొద్దీ బిడ్డమీద ప్రేమ ఎక్కువ కాసాగింది. 'డబ్బు సంపాదించుకొన్నాక కాసెట్టీని నాదగ్గిరకు తెచ్చుకుంటాను' అనుకొని, అంతలో పకాలున నవ్వేది. ఆ నవ్వుతో ఉమ్మరంగా దగ్గు. వెన్నున చల్లగా చెమటలు పోశేవి.

ఒకనాడు థెనార్డీర్ల దగ్గిరనుంచి ఉత్తరంవచ్చింది. 'కాసెట్టీ మిలియరీ జ్వరంతో తీసుకొంటూంది. పిల్లమందుకు డబ్బు కావాలి. వారంరోజుల్లో 40 ఫ్రాంకులు పంపకపోతే మందు లేక కాసెట్టీ చచ్చిపోతుంది.'

పకాలున నవ్వింది. ఏంచిత్రం మనుష్యులు! నలభై ఫ్రాంకులు కావాలిట ఎక్కడినుం చొస్తాయి. అయ్యో. తెలివితక్కువ మొగాలా!'

కాని వెలుతురుకుపోయి మళ్ళీ ఉత్తరంచూచుకొంది.

ఒకరు చూసి 'ఎందుకమ్మా అంత నవ్వుతున్నావ' ని అడిగారు. 'కొందరు పల్లెటూరువాళ్ల మూర్ఖత్వానికి నవ్వు వస్తోంది' అంది.

త్రోవలో ఒక గుంపు కనపడితే అక్కడ నిలుచుంది. దంతవైద్యుడొకడు పల్లుకట్టించుకోమని జనంముందు తనడబ్బా

కొట్టుకొంటున్నాడు. ఆతని హాస్యానికి జనం నవ్వుతున్నారు వాళ్ళల్లోజేరి ఫాంటైన్ నవ్వింది.

'పిల్లా నీకు చక్కని పళ్ళున్నాయి. పై రెండుపళ్ళకు 40 ఫ్రాంకులిస్తా నిస్తావా ?'

భయంతో అక్కడినుంచి పరుగెత్తింది.

'పిల్లా ఆలోచించుకో ఎప్పుడైనా సరే' అని కేక. ఇంకా పరుగెత్తింది.

రాత్రి యాదాలాపంగా ముసలమ్మతో ఈ సంగతి చెప్తూ మిలియరీ జ్వరం అపాయకరమా అని అడిగింది.

బిడ్డలకు వచ్చే జబ్బులన్నీకల్లా అపాయకరం.

మళ్ళీ ఆలోచించింది. 40 ఫ్రాంకులు !

మర్నాడు పొద్దున్నే మార్గరెట్ ఆమెను చూసింది. నోటిలో పెద్దతొర్ర. రక్తం, ఉమ్మికలిసి ఎర్రగా చొంగ కారుతూంది. థెనార్డియరుకు 40 ఫ్రాంకులు చేరాయి.

'నాకేంకేంఫరవా ! నాబిడ్డ బ్రతుకుతుంది.'

గొరిగినతల, బోసినోరు. అద్దంవిసిరావతలపారేసింది. ఫాంటైన్ మునుపున్నగది ఎప్పుడోవదిలేసింది. అటుకగది, అలమారం తడి, నివాసం. నేలమీద చీరపరచుకొని, కప్పుకొనిపడక.

విస్మృతిపథంలో, నీరులేక గులాబిమొక్క వడిలిపోయింది స్త్రీ సహజమైనస్వేచ్ఛలుపోయాయి. అప్పులాళ్ళు రోడ్లమీద హంగామా చేయసాగారు. మేనకేన్ అంటే సర్వాంగాలు

ద్వేషంతో కంపించిపోతూన్నాయి. పదిహేను గంటలుపని చేసేది. 9సోలు. (9 దమ్మిడీలనుకోండి !) అప్పలాళ్ళు మరీ కఠినులయి పోయారు. "దొంగముండా! డబ్బెప్పుడిస్తా" వన్నాడు యింటియజమాని.

'దైవమా! ఏంచెయ్యమంటావో నన్ను, ఎల్లా ఇస్తానుకొంటారో డబ్బువీళ్లు!' వేటకాండ్రు) చుట్టుముట్టేసిన అడివి మృగం తత్వం కొంత అబ్బింది. ధనార్థిగ్గా ఉత్తరం వ్రాశారు. చాలా కాలము ఓపికపట్టాము. నూరుఫ్రాంకులు పంపితేనే గాని 'జబ్బుతో ఉన్న కాసెట్టీని వెళ్ళగొట్టాలిసొస్తుంది.

'నూరు ఫ్రాంకులు! నూరుసోలు సంపాదించే వృత్తి లేదే! సరే ఉన్నదంతా అమ్ముకొంటాను.'
బజారున పడింది. ఆడది అమ్మగలిగినంతా అమ్మటానికి.

# ౮ వ ప్రకరణము

పదినెల్ల తరువాత ఒకనాటిసంజె చీకట్లో, ఒక యువతి సోల్జర్స హోటల్‌కెదురుగా చేతనైనట్టుగా సింగారించుకొని తారాడుతూంది. తలమీదటోపీ V— మెడ జాకెట్టు. కిటికీకెదురుగుండానే ఇటూఅటూ తిరుగుతూంది. ఆమెతిరుగుతూన్న చోట ఒకపోకిల్లా, తనుఊళ్ళో రౌడీనని గర్వంతో చెప్పుకొనే రకం, నుల్చుని ఆమెనపహసిస్తూ దుర్భాషలాడుతున్నాడు. 'ఓహో! భూతక్కి-బొమ్మ- ఏవీముందుపళ్ళు? బోసినోరేనా, దాలిగుంటలకేసిపోరాదూ .......................... నోటికివచ్చినట్లల్లా అంటున్నాడు. ఆ మంచులో, ఆ చలిలో, ఆయువతి అతనివంకన్నా చూడకుండా ఒక ఛాయలాగ అల్లాగే ఇటునటు పచారుచేస్తోంది.

తనమాట లామెమీద ఏమీ పనిచేయక పోవడంతో ఆ రౌడీకి వేడెక్కింది. ఉడుకుబోతుతనం రాదామరి!

ఎల్లాగైనా ఈ మనిషి నేడిపించా లనుకొని తన్ను దాటి పోతూన్నప్పుడు. గుప్పిళ్ళనిండా మంచుతీసి రెండు బుజాలమధ్య వీపునేసికొట్టాడు. ఆ మంచు దెబ్బకదిరిపడి. కెవ్వున కేక వేసి ఆస్త్రీ చిరుతపులిలాగ అతనిమీందకురికి మొగ మంతా రక్కుతూ, తన్నుతూ ఆతనితోకలబడింది. ఆఉద్రృతంలో ఇద్దరు మురికికాలువ పక్కపడ్డారు. చెడ్డబూతులు తిడుతూంది. కంఠముబొంగిందివల్ల గద్గమయి స్వరం బొంగురుగా నోటిలోనుంచి బొంగురుగా వస్తోంది.

చుట్టూ కేరింతాలు కొడుతూ జనంమూగారు. ఆయిద్దరి వ్యసనం తక్కిన జనానికి సంతోషకారణం. ఆడదెవరో మగుగా డెవరో తెలియటంలేదు. ఆడదానికి జుట్టు, పళ్ళులేవు. పైనబడి గోళ్ళతోగీరుతూ, తన్నుతూ, బూతులు తిడుతూంది. బట్ట బుర దైపోయింది.

ఒక పొడుగాటివ్యక్తివచ్చి ఆమెచేయి పట్టుకొని 'నావెంటరా' అని అధికారంతో అన్నాడు.

ఫాంటైన్ జావర్టుని చూచిక్రుంగి, నిశ్చేష్టురాలయింది. ఆమెలో రోషం, కోపం, ఉద్వేగంఅన్నీ చప్పున చల్లారాయి. మారుమాట లేకుండా ఆతని వెంటబయలు దేరింది.

జావర్ట్ పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ పోలీసుస్టేషనుకేసి నడిచాడు. అతనుగాని, ఆమెగాని, ఏమీ మాట్లాడలేదు.

జాతర మేక పిల్లలా, అతనివెంటబడి పోయింది వాళ్ళవెంట ఒకమంద ఉత్సాహంతో పడిపోతున్నారు. విచిత్ర విధి. ఒకరి పెనుసంతాపం పెక్కురకు పైశాచికానందం కలిగిస్తుంది.

పోలీస్‌స్టేషన్ చేరగానే జనానికుత్సాహ భంగంగా జావర్టు బైటితలుపులు వేసేశాడు. హడలుతూ, దెబ్బలుతిన్న కుక్కలా ఫాంటైన్ ఒకమూల నేలమీద కుంచుకొని కూర్చుంది. పరాసుచట్టము ప్రకారం, అల్లాంటిస్త్రీలను పోలీస్ఇన్స్పెక్టరు విచారించి తోచినశిక్ష విధించవచ్చు. వాళ్ళస్వత్తి, స్వేచ్ఛ రెంటినికూడా అరికట్టి వాళ్ళని శిక్షించ వచ్చును.

జావర్టు, ధర్మదేవతలా కూర్చుని వ్రాస్తున్నాడు. అతని విచారణాక్రమంలో కరుణ, హృదయం, అనేవిలేవు. అంతరాత్మ చెప్పిన న్యాయం అనుసరిస్తూ అతడు ఆమెను విచారిస్తూన్నాడు. తనధర్మంలో అతను తీవ్రంగా మగ్నుడయి పోయాడు. తను చూచిన విషయాలన్నీ జాగ్రత్తగా సంచయపరచుకొని సక్రమంగా అనుసంధానించుకొంటున్నాడు. ఆనిముషాన్న ఏన్యాయాధికారీ అతని కందడు తనే విచారించి తనే శిక్షిస్తున్నాడు. ఆలోచించినకొద్దీ ఆ స్త్రీ ప్రవర్తన మతనికతీనింద్య మనిపించింది. ఒక సంపన్నకులీనుని, అంగసంఘమును, ఒకపణ్యాంగన, అంటే అవినీతి ధిక్కరించింది. ఒకగుడిసేటి ఒక నాగరికుని తిట్టికొట్టింది. ఈ అకృత్యానికి తాను ఇన్‌స్పెక్టర్ జావర్టు సాక్షి.

నిశ్శబ్దంగా వ్రాతముగించి, తనసంతకం పెట్టాడు. ఒకసార్జం ట్ను పిలిచి, కాగితంమడిచి అతనిచేతికిచ్చి, 'ఇద్దరైట మనుష్యుల్నితో లేసి ఈ అమ్మిని జెలులో పెట్టు.' అని ఫాంటైన్‌వంక తిరిగి 'నీకిందుకారు నెలలు జైలువిధించాను.' అన్నాడు.

ఫాంటైన్ ఉలికిపడింది. 'ఆరునెల్లా! ఆరునెల్లుఖైదా! అని అరిచింది. 'ఆరునెల్లు! రోజుకేడు సోలుసంపాదనా! కాసెట్టీ ఏమవుతుంది. ఇన్స్పెక్టరుగారూ నేను థెనార్డీర్లకు నూరుఫ్రాంకులుపైగా యియ్యాలి తెలుసునా?'

మోకాళ్ళమీద దేకుతూ చేతులు జోడించుకొని, దేహాన్ని దు్ప్పకొంటూ జావర్ట్‌దగ్గర కొచ్చింది.

జావర్ట్‌గారూ క్షమించండి. నిజంగానాతప్పులేదండీ. ముందరనుంచి ఉన్నట్లయితే మీకే తెలిసేదండీ. ఆయనెవరో నేనెరుగను. నావెన్నుమీద మంచుగడ్డ పడేశాడు. నేనెవళ్ళనీ ఏమీచెయ్యకుండా ఊరికే అక్కడతిరుగుతూంటే అల్లాచెయ్యొచ్చునాండి మరి, నాకుబాధతో ఒళ్ళుతెలియకే నాకుఒంట్లో బాగుండలేదు: చాలాసేపటినుంచి ఆయన నన్ను వృథాగా తిడుతూన్నాడుకూడా."బోసినోరుఅనాకారి......"అంటూ, ఏమేమిటోఅంటూ. 'నాకెందుకు ఆయన సంతోషిస్తున్నాడు. అల్లాంటివాళ్ళ సంతోషానికే కదా మాబ్రతుకు పోనీలెమ్మనుకున్నా. జావర్ట్‌బాబూ మీకునిజం చెప్పేవాళ్ళెవళ్ళూ ఇక్కడలేరూ?

కోపం రావటం నాతప్పేనండీ అల్లాంటప్పుడాపుకోటం కష్టం కాదా! నాకుతొందరెక్కువే. ఆయనల్లా కొట్టడం నాది

తప్పే. హారేరీబాబూ? వారికిక్షమార్పణ కోరుకుంటాను. ఈ సారికి వదిలేయండి. జావర్ట్‌గారూ! జైలులో 7 సోల కన్న సంపాదించటానికి వీల్లేదని మీరెరుగరేమో! గవర్నమెంటు వారి తప్పంటంలేదు. కానీ సంపాదనంతే. నేను నూరుఫ్రాంకులు థెనార్డీర్లకి యివ్వాలి. లేకపోతే నాబిడ్డను వీధిలోకి తరుము తారు. ఈ రీతిగా చెడ్డ బ్రతుకు బ్రతుకుతూ నాబిడ్డను నాదగ్గి రుంచుకోలేను. కాసెట్టీ! నామాణిక్యం, నీగతేమిటమ్మా! బాబూ! థెనార్డీర్ల సంగతిమీరెరుగరు, రేచ్చిక్క మనుష్యులు. డబ్బు, డబ్బు, డబ్బు. డబ్బియ్యకపోతే నాబిడ్డను వెళ్ళగొడ్తారు. జావర్ట్‌బాబూ! కరుణ లేదా, నాకోసంకాదు. నాబిడ్డనుచూడు! ఈ నడిసీతాకాలంలో నాకూతుర్ని వెళ్ళ గొడ్తారు. సంపాదించుకొనే యీడులేదు. చలికిచచ్చిపోతుంది. నిజంగా నేనంతచెడ్డదాన్ని కాదు. దారిద్ర్యం, దుఃఖం భరించలేక త్రాగుడలవాటు చేసుకొన్నాను. నాకిష్టంలేదు. కాని అది లేందే, నే నే పాపంచేయలేను. జావర్ట్‌గారూ! కరుణించండి, నన్ను క్షమించండి.'

చితికిపోయి, వెక్కి వెక్కి ఏడుస్తూ, కళ్ళనీళ్ళతో గుడ్డివడి, మధ్యమధ్య 'ఖరేల్' 'ఖరేల్' మనేపొడిదగ్గుతో, నత్తినత్తిగా రుద్ధకంఠంతో, మృత్యుఘోషంతో విలపిస్తూంది. మధ్యమధ్య ఆగుతూ అతనిపాదాలు గట్టిగా పట్టుకొంటూంది. ఆ ఘోర మైనవిపత్తు ఆ అభాగ్యురాలి మోముకొక వింతవన్నె తెచ్చింది. ఆ దుస్సహకష్టమధ్యమున, ఫాంటైన్, తనుపోగొట్టుకొన్న పూర్వలావణ్యంతో మళ్ళీప్రకాసిస్తూంది. రాతిగుండె

లనైనా ఆమె కరిగించ కలిగేది. కాని, జావర్టుగుండెకొయ్య!
చలనం లేదు! "సరి! నువ్వు చెప్పేదంతా అయిందా ఇంకేమైనా ఉందా! ఆరునెల్లుశిక్ష. బ్రహ్మదేవుడైనా తప్పించలేడు' అన్నాడు చలించకుండా జావర్టు.

తీర్పువిని 'దయాభిక్ష' అని గొణుగుతూ కుప్పగా నేలను కూలిపోయింది ఫాంటైన్. ఇద్దరు సిపాయీలు చెరొక రెక్క పట్టుకొన్నారు.

కొన్నినిముసాలకు పూర్వం ఒకవ్యక్తి ఎవరూ గమనించకుండా తలుపుతోసికొని లోపలికివచ్చి తలుపువేసి గుమ్మాన్నానుకొని నీడలో నిలుచున్నాడు. ఫాంటైన్ మీద సోల్జర్లు చేతులు వేయగానే అతను చీకటిలోనుంచి ముందుకువచ్చి—

'దయచేసి ఒక్కక్షణమాగండి' అన్నాడు.

జావర్టు తలెత్తి మాడలేన్ను చూశాడు. తనలో కలిగిన చీకాకును కప్పిపుచ్చుకొని లేచి నిలబడి, టోపీతీసిసలాంచేశాడు.
'క్షమించండి! మేయరుగారూ'

'మేయరుగారూ!' అన్నమాట వెలువడినంతనే ఫాంటైన్లో ఒకవింత చైతన్యం కలిగింది.

ఒక్క ఉరుకున సిపాయీల వదల్చుకొని, మేయరుదగ్గిరకునడిచి వెఱ్ఱిచూపుతో—

'నువ్వేనా మేయరువు!' అని అరిచి వికృతాట్టహాసంతో నవ్వి అతని మొగాన్న కాండ్రించి ఉమిసింది.
మేడలేన్ మొగం తుడుచుకొని—

'ఇన్స్పెక్టరు జావర్టు! ఈస్త్రీని వదిలెయ్యి' అన్నాడు శాంతంగా. జావర్టుకా నిముసాన్న పిచ్చెత్తుతోందా అనిపించింది. ఒక్క సారిగా అతని మనస్సులో ఉద్విగ్నభావాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని అల్లకల్లోలంగా పరుగులెత్తుతున్నాయి. అతను ఊహించటానికైనా అలవికాని ఘోరాపచారం— ఒకగుడిసేటి మేయరుగారి మొగంమీద ఉమిసింది— అతని కనులముందు జరిగింది. ఒకప్రక్క అతనిమనస్సులో వేరే కల్లోలం జరుగుతూంది. ఈ మేయరే అతవనుకొన్న వ్యక్తి అయితే ఈ అపచారం అతిస్వల్పం, సామాన్యమూ. కాని ఈ మేజస్ట్రీటు, ఈమేయరుగారు, శాంతంగా మొగంతుడుచుకొని 'ఈస్త్రీని వదిలేయ్' అనటం మిరుమిట్లుగొలిపి అచేతనుణ్ణిచేసింది. మూగపోయాడు.

ఆ వాక్యంతో ఫాంటైన్ చలించింది. చుట్టూకలయచూచి తనలో తనకుగా మాట్లాడింది.

'స్వేచ్ఛా! నన్ను వదిలేస్తారా! అయితే ఆరునెల్లు జైలుకు వెళ్ళక్కరలే? ఎవరూ, అల్లాఅంది? నేతప్పు విన్నానా! ఆ మేయరు రాక్షసుడు మాత్రంకాదు. మాబాబూ! జావర్టు నువ్వేనాఅంది? ఇదిగో మీతోఅంతా చెబుతున్నా! నన్ను విడిచిపెడతారుకామా! అదుగో ఆ మేయరు రాక్షసుడున్నాడే! ఆ దుర్మార్గుడు మేయరే దీనికంతకూ కారణం. జావర్టుగారూ వినండి. ఎవళ్ళో దుర్మార్గపు ముండలు చెప్పే పురాణంవిని నన్ను పనిలోంచి తొలగించాడు. అంతకన్నా ఘోరముందా? న్యాయంగా తన జీవితం గడుపుకొంటూన్న

పేదపిల్ల నల్లా పొట్టమీదకొడతాడా ? ఆ తరువాత ఎక్కడా నాకు సరిగ్గా సంపాదన లేదు. కూలిధరలు పడిపోయి రోజుకు ఏడు సౌలుమించి వచ్చేవికావు. అందుకని నానాగడ్డి కరిచాను. ఈ దరిద్రుడు మేయరే కారణం. ఇందాక నాతో దెబ్బలాడి నాయన నాయిం చొక్కా చించేశాడు. మావంటివాళ్ళ కొకటి కంటే ఎక్కువ చొక్కాలుండవు జావర్టుగారూ ! నన్ను విడి వేయమన్నారు కాదూ ! ఇంకా మాయింటిదగ్గిర కనుక్కోండి. నేను ఋజువుగానే బ్రతుకుతున్నానండీ. నాకంటే పాడయి పోయిన స్త్రీలు నాకంటె బాగానే బ్రతుకుతున్నారు.'

మేడలేన్ ఆమె మాటలన్నీ జాగ్రత్తగా వింటున్నాడు. జేబు లోనుంచి పర్సుతీశాడు. పర్సులో డబ్బులులేవు. చప్పుడు కాకుండా లోపల పెట్టేశాడు.

"ఎంత బాకీ పడ్డానన్నావమ్మా?" ఫాంటైన్ చర్రుమని అతనివంక తిరిగింది.

"నేను మీతో మాటాడటంలే'

అని సిపాయీలవంక తిరిగి నేనువాడి మొగాన్నెల్లా ఉమ్మేశానో చూశారు కాదయ్యా ? దొంగాముండా కొడుకు మేయరునన్ను హడలగొడదామని ఇక్కడకు వచ్చాడు. నువ్వంటే నాకు భయంలేదురా! నాకు జావర్టు గారంటేనే భయమూ, భక్తినీ. జావర్టుగారు దయాళువు "అంటూ మళ్ళీ" జావర్టువంక తిరిగి అంది.

"ఏమైనా; జనంకూడా న్యాయం చూడాలి. మీపద్ధతి నాకర్థ మయిందండీ! జావర్టుగారూ! ఒక దాసీమనిషిని ఒక పెద్దమనిషి

మంచుతో కొట్టాడు. చుట్టూ జనం నవ్వారు. పదిమందీ సంతో షించటానికే కాదా మా బ్రతుకుమరి. ఆఅమ్మి ఎదురు తిరగడం చూసి అల్లరి మాన్పించాలని, ఇద్దరిని విడదీసి, ఆ అమ్మినిక్కడకు తీసుకొచ్చారు. దయామూర్తులుకనుక నాబిడ్డను చూచీ, నన్ను చూచీ, నన్ను వదిలేశారు. ఆను నెల్లుఖైదు వేస్తే నాబిడ్డ గతి ఏమిటా అని ఆలోచించారు. 'ముండా, మళ్ళీఇక్కడకు రావద్ద' న్నారు. బాబూ ఇకెప్పుడూ అపచారం చెయ్యను. ఇక్కడనుంచీ నన్ను జనం ఏంచేసినాసరే. కదలను, మెదలను. ఇందాక గుండెల్లో బాధపెట్టి అల్లా అరిచానండీ! నావంట్లో కూడా ఏమీం బాగుండలేను. అస్తమానం దగ్గొస్తుంది. కడుపులో నిప్పు ముద్దకట్టినట్టుగా మండుతుంది. డాక్టరు జాగ్రత్తగా చూచుకోమని చెప్పారు. ఇంకానావళ్ళు చూడండి. భయం లేదులెండి" అంటూ జావర్టు కఠినహస్తం తన మృదువైన కంఠంమీద అన్చింది.

ఇంతలో లేచి, తనవసనం సర్దుకొని, ఫాంటైన్ గుమ్మంవంక నడిచి, సిపాయీలవంక స్నేహంగాచూస్తూ—
అయ్యాలారా! జావర్టుగారు నన్ను పొమ్మన్నారు. పోతున్నా నంది.

గుమ్మంలో అడుగుపెట్టి తలుపుముట్టగానే అంతవరకు కొయ్య బొమ్మలాగా జడంగానిల్చున్న జావర్టు ఒక్కఅదటుదకదలిక తెచ్చుకొని భయంకరంగా కేకవేశాడు.
'సార్జంట్' ముండ పారిపోతూంది. కళ్ళులేవా! ఎవరు పోనిమ్మ న్నారునిన్ను?'

"నేను" అన్నాడు మేడలేన్. జావర్టుకంఠంవిని, వణకుతో ఫాం
టైన్ పట్టుబడ్డ దొంగలా తలుపు వదిలింది. మేడలేన్ గొంతు
విని అటుచూచింది. ఆ నిముసంనుంచి ఆమెకంతా అగమ్య
గోచరమైపోయింది. జావర్టునుంచి మేడలేన్ కేసి, మేడలేన్
నుంచి జావర్టు కేసి నిర్ఘాంతపోయి చూస్తూంది.

జావర్టులో స్వస్థతకొంచెం తప్పిందేమో! లేకపోతే తను-పోలీస్
ఇన్‌స్పెక్టరు మేయరు నెదిరించడమా! కాక, గతయామంలో
జరిగిన అపకతవకలతో తాను పోలీస్ ఇన్‌స్పెక్టరు మాత్రం
గా మిగిలిపోక మహాన్యాయాధికారవుదా మనుకొన్నాడో !
పాలిపోయిన మొగంతో, నీలిపారిన పెదవులతో, తెగింపు
చూపులతో స్వల్పంగాకనుబడకుండా, చలిస్తూ, చూపుక్రిందకు
వాల్చి బింకంగా—

'మేయరుగారూ ! అల్లావల్లకాదు అన్నాడు.

'ఎందుచేత?'

'ఈ నీచురాలు ఒకపెద్దమనిషినవమాన పరచింది.'

నెమ్మదిగా, అనునయపు పలుకులతో మేడలేన్ అన్నాడు.

'ఇన్‌స్పెక్టరు జావర్టు నామాటొకటివిను. నీవు సద్వర్తనుడవని
నేనెరుగుదును. అందుచేతనీకునచ్చ చెప్పటం కష్టంకాదు.
అసలు జరిగిన సంగతివేరు. బజారునపోతూ, గుంపుగూడి
ఉండటంచూచి, అక్కడకుపోయి నేను నిజంతెలుసుకొన్నాను.
తప్పంతా ఆ పురుషుడిదే. న్యాయప్రకారం, ఆమెకు, బదు
లుగా, అతన్ని అరెస్టు చేయవలసింది.

జావర్టు అడ్డుచెప్పాడు.

"ఈ తుచ్ఛురాలు మేయరుగార్ని అవమానపరిచింది.'

"ఆ సంగతి నేను చూచుకొంటాను. ఆ అవమానం నాది. నాచిత్తంవచ్చినట్లు చెయ్యొచ్చు"

"క్షమించండి. ఆ అవమానం మీదయినా విచారణ జూడిషి యరికోర్టువారు చేయవలసిఉన్నది.

'ఇన్స్పెక్టరు జావర్టు! అంతర్వాణిని మించిన న్యాయాధిపతి: న్యాయస్థానంలేవు. ఆ స్త్రీ చెప్పినది నేను విన్నాను. నేనేం చేస్తున్నానో నాకు తెలుసు."

"మేయరుగారూ ! నేనేం, చూస్తున్నానో నాకు తెలియటం లేదు"

'ఆపక్షంలో, ఆజ్ఞాపాలనంలో తృప్తిచెందు."

'నాధర్మం నేను పాలిస్తున్నాను. తద్విధిగా ఆరునెల్లు ఆమె జైలుకు వెళ్ళితీరాలి.

మేడలేన్ గాంభీర్యంగా మందరస్థాయిలో అన్నాడు.

'సావధానంగావిను జావర్టు. ఒక్కరోజయినా జైలుకు వెళ్ళదు.

ఈ నిశ్చిత వాక్యాలువిని, జావర్టు, గౌరవం మాత్రం తొలగ నీకుండా, నిశితంగా అతనివంకచూస్తూ అన్నాడు. 'మీమాట కెదురాడ వలసివచ్చినందుకు నేనువిచారిస్తున్నాను. మేయరు గారూ! నాజీవితంలో, పెద్దలనెదిర్చడమిదే మొదటిసారి. కాని నేను నావిధినతిక్రమించుట లేదని ప్రార్థనతో విన్న విస్తున్నాను. మీకొరికక ప్రకారం. మీపట్లజరిగిన అపచారం

అవ్వాలపెడుదాం. రెండవవిషయమే మాట్లాడుతాను. నాసమ క్షాన్న ఒకఇంటి యజమాన్ని, కౌన్సిలరును, ఈ పిల్ల తిట్టి. కొట్టింది. ఏవిషయం ఎల్లాఉన్నా ఇదిమాత్రం పోలీసుకేసు, నేను విచారించవలసిఉంది ఆ ప్రకారంగా, ఈ నేరస్తురాలిని విచారించి నేనారునెల్లుఖైదుశిక్ష విధిస్తున్నాను'

మేడలేన్ చేతులు కట్టుకొని పరుషంగా అన్నాడు. (అంతవర కూ ఆ ఊరివాళ్ళెవళ్ళూ అతనివాక్కు ఆంతకఠినంగా ఉండ టం ఎరుగరు.)

'నీవు చేప్పే కేసు సెంట్రల్ పోలీసుది. క్రిమినల్ కోడ్ 9, 11, 15, 61, సెక్షనుల ప్రకారం, విచారించవలసినది నేను. ఈ స్త్రీని విడుదల చేయమని నేను ఉత్తర్వు జారీచేస్తున్నాను'.

తుదిప్రయత్నంగా జావర్టు ' కాని, మేయర్ గారూ... ' అని మొదలు పెట్టాడు.

మధ్యలో మేడలేన్: "1799సం॥ చట్టపు, 81 సెక్షన్, నిరంకు శ నిర్బంధత్వాన్నిగురించి చెప్పిన విషయాలని మన్ననచేసుకో మని కోరుతున్నాను."

"నామాట......"

'మాట్లాడవద్దు'

"కాని........."

" బైటికి పో!"

రష్యన్ సిపాయిలా ఎదురొగ్గిమ్ముగ అనుకొన్నాడు, ఈగుండు దెబ్బ. జావర్టు తలవాల్చి భూమికివంగి, బైటికిపోయాడు. ఫాంటైన్ తలుపానుకొని నిల్చుని, తన్ను దాటిపోతున్న జావర్ట్‌కేసి వెర్రిగా విస్మయంతో చూస్తూంది. కొంతసేపటి క్రితంనుంచీ ఆమెలో మహాకల్లోల మారంభమయింది. రెండు మహాశక్తులు తన్నుగూర్చి యుద్ధంచేయటం చూస్తూంది. ఇద్దరువ్యక్తులు తనముందు తన్నుగురించి కుస్తీపడుతున్నారు. తన మానం, ప్రాణం, స్వేచ్ఛ, బిడ్డ, తనఆత్మ, తనసర్వస్వం వాళ్ళచేతుల్లో వున్నాయి. భయంతో ఒణికిపోతూన్న ఆమెకు ఈ వ్యక్తులు, దేవాసురులులా కనుపించారు. ఒకడు తన దైవతమట్లు పలికాడు. ఒకడు అసురునిలా తనపై కక్షకట్టాడు. దైవతము రాక్షసుని జయించాడు. కాని వక్కవిషయం ఆమె గుండెల్లోనాటి ఆమె నాపాదమస్తకం కంపింప చేసింది. ఏ దేవుడు తన్ను రక్షించాడో, ఆ దేవుణ్ణే తన ఆజన్మాంతం కష్ట సాధిద్దామని పూర్తిగా అసహ్యించుకున్నది. పైగా అతన్ని నీచాతినీచంగా అవమానపరచిన క్షణాన్నే అత డామెను రక్షించాడు. నిద్రా! కలగంటూందా! ఈ ఆత్మే పూర్తిగా మారిపోవాలా! ఆ కంపంలో మేడలేన్ అంటే అసహ్యాం, ద్వేషం అంతా ఒక్కసారిగా మంచులా కరిగి పోయింది. అతనియెడ ఆమెలో అంకురించినభావం వర్ణనాతీతం.

జావర్టు వెళ్ళిపోగానే మేడలేన్ ఆమెవంకతిరిగి కన్నీరాపుకొంటూన్న కంఠంతో నెమ్మదిగా అన్నాడు—

“నీ కథ విన్నానమ్మా. నీవు చెప్పిన విషయాలు నాకేం తెలియవు. కాని నేను నిన్ను నమ్ముతున్నాను. నీవు ఫ్యాక్టరీ వదలినట్లే నాకు తెలియదు. నాతో యెందుకు చెప్పలేదుతల్లీ! నీ అప్పులుతీర్చి, నీబిడ్డకు కబురుచేస్తాను. నీ యిష్టంవచ్చినచోట ఇక్కడైనాసరే, పారిస్‌లో ఐనాసరే, నీ బిడ్డతో హాయిగా జీవించు. కావలసినడబ్బు నేనిస్తాను.మళ్ళీ మర్యాదతో గౌరవంతో జీవించు. ఒక్కసంగతి తెలుసుకోమ్మా! నువ్వు చెప్పినట్టే అయివుంటే— నాకపనమ్మకం ఏమాత్రంలేదు— పాపం అనేది, ఈనాటిదాకా నిన్నంటలేదు. దైవసముఖాన నీ సత్యానికీ, నీ శుచిత్వానికీ ఏమాత్రం కొరతరాలేదు. పిచ్చితల్లీ!” అని శిరం చేతితో నిమిరాడు.

తనతో కాసెట్టీయా! ఈ తుచ్ఛ జీవనాని కంతమా! ఈ కరుణ, ఈ సౌఖ్యం, ఫాంటైన్ భరించలేకపోయింది. సంధి చేష్టలాగ అతని చేతులుపుచ్చుకొని కన్నుల కద్దుకుంటూ ‘ఓః! ఓః! ఓః!’ అని వెక్కివెక్కి రోదిస్తూ కుప్పగాకూలి మూర్ఛపోయింది.

# ౯వ ప్రకరణము

ఫాంటైన్‌ను తన ఆస్పత్రిలో చేర్పించి, మేడలేన్ కాసెట్టి కోసం కబురుచేశాడు. థెనార్డీర్ ఉత్తరం చూచుకొని "డబ్బు గల వాడెవరో ఫాంటైన్‌ను చేరదీశాడు. కాబట్టి ఇంకా డబ్బులాగవచ్చు" ననుకొని పంపక సాకులుచెప్పి డబ్బుఅడిగారు. ఫాంటైన్ సంతకంతో ఒకఫర్మానా తీసికొని మేడలేన్ తనే బయలుదేరివెళ్ళి, కాసెట్టీని తీసుకువద్దామని సంకల్పించు కొన్నాడు. పిల్లను తీసుకొస్తేనేగాని ఫాంటైన్ దేహస్థితి బాగుపడేటట్టులేదు.

ఒకనాడు పొద్దున మేడలేన్ తన గదిలోకూర్చుని వ్రాసుకొంటూండగా నౌకరువచ్చి జావర్టుగారు వచ్చారనిచెప్పాడు. మేడలేనుకు కొద్దిచిరాకు తోచింది. పోలీసుస్టేషనులో విషయం జరిగినప్పటినుంచీ జావర్టు మునుపటికన్నా మేడలేనును తప్పించుకుని తిరుగుతున్నాడు. అందుచేత ఆతరువాత మళ్ళీ జావర్టు మేడలేనును కలుసుకోలేదు.

'లోపలికి రమ్మను'
జావర్టు ప్రవేశించాడు.
మేడలేన్ తలెత్తకుండా వ్రాసుకుంటూనే ఉన్నాడు. అతని మనస్సంతా ఫాంటైన్ సమస్యమీదఉంది.
జావర్టు అతిగౌరవంతో వంగి సలాంచేశాడు. మేడలేను వీపు గుమ్మంకేసిఉంది. వెనక్కి తిరగకుండా అతను వ్రాసికొంటున్నాడు. జావర్టు గదిలో కొన్నిఅడుగులు ముందుకువేసి నిశ్శబ్దంగా నిలుచున్నాడు.

జావర్టు నెరిగున్న సాముద్రికుడు (Physiognomist) ఎవరన్నా ఆక్షణాన్న అతన్నిచూసి ఉన్నట్టయితే "ఏమిజరిగిందా ఇతనికి?" అని విభ్రాంతుడవక మానడు.

జావర్ట్ సత్యసంధత, ధర్మభీతి, న్యాయచరణ నిశితత్వము, మనోనిష్కల్మషత్వము, అతని అంతరాత్మ తీవ్రత, ఎరిగివున్న అతనిహృదయం మహాక్షుభితమై, అతనా తుపానులోనుంచి అప్పుడే బైటపడ్డట్టు గ్రహించవచ్చు. అంతవింతగా, అంతకొత్తగా అతనిముఖమేనాడూలేదు. గదిలోప్రవేశించి, మేయరుగారికినమస్కరించి అతనుచూచిన చూపులో, అనుమానము, ద్వేషము, కసి, ఏమీలేవు. జన్మలో, ఓరిమితప్ప వేరొండు మార్దవమెరుగని మానిసిలోని కర్కశత్వాన్నిమించి ఆ చూపులో ఏమీలేదు.

సంపూర్ణవినయంతో, సర్వసంగ పరిత్యాగంతో, యుద్ధసైనికుడిలాగ, మేయరుగారి చిత్తంవచ్చి మాట్లాడేదాకా మాట్లాడకుండా, శాంతంగా నిశ్చలంగా, టోపీచేతిలో పట్టుకొని,

సగం— అధికారిముందరి సైనికునిలా, సగం—జడ్జీముందరినేరస్తుడిలాగా— నిలబడ్డాడు. అతనిలో, పురాతన భావాలూ, పురాతన నిశ్చయాలూ అన్నీనశించిపోయి, సర్వశూన్యమైన విషాదం జేబు చీకట్లులా ఆవరించి, అవిచ్ఛిన్నమై అతనిముఖాన్ని శిలాప్రతిమనుచేసింది. అతనిలో కించత్వము (humiliation.) నిశ్చలత్వము, ధృతిపూరితమైన ఖిన్నత రూపర్చుకొన్నాయి. తుట్టతుదకుమేయరు కలం ప్రక్కను పెట్టి సగంతిరిగి "ఏంజావర్ట్ ఏమిటిసంగతి ?" అనిఅడిగాడు.

'ప్రభూ! ఒకమహాపరాధం చేయబడ్డది''

"ఏమిటది"

"ప్రభుత్వపు చిన్నసౌకరొకడు, ఒకమేజస్ట్రేటు గారియెడ తన విధినిర్వర్తించటంలో, ఒక ముఖ్యవిషయంలో మహాపరాధం చేశాడు. నాధర్మంప్రకారం ఈవిషయం తమకు తెలియపర్చటానికి వచ్చాను."

"ఎవరా సౌకరు ?''

''నేను''

'మేజస్ట్రేటెవరు'' !

"మేయరుగారూ! మీరే"

మేడలేన్‌నిటారుగాకూర్చున్నాడు. జావర్ట్ తలవంచుకొని,అదే ధోరణిలో తీవ్రంగా చెప్పతున్నాడు.

మేయరుగారూ, నన్ను ఉద్యోగంలోనుంచి డిస్‌మిస్ చేయమని కోరటానికి వచ్చాను. మేయర్ విభ్రమంతో నోరుతెరి

చాడు. సాగకుండా జావర్టు.

'నా రాజీనామా పంపరాదా అంటారేమో? అది చాలదు. అదిమర్యాదైన పద్ధతేగాని నేనామర్యాదకు తగను. తప్పు చేశాను. శిక్షార్హుడను. అందుచే డిస్మిస్ చేయవలసిందే"

అనికొంత ఆగి—

'మేయరుగారూ! ఆనాడు అన్యాయంగా నాయెడ తీవ్రత్వము చూపారు. నేడున్యాయంగా తీవ్రిచర్య తీసుకోండి"

"ఏమిటీ అర్థంలేని వాగుడంతా, నీవుచేసిన నేరమేమిటి?"

జావర్టు ఒకదీర్ఘ నిశ్వాసం విడిచాడు.

"ఆరువారాలక్రితం నేను మీమీద నేరంమోపుతూ పై అధికారులకు రిపోర్టువ్రాశాను."

మేడలేన్ పకాలున నవ్వాడు.

'పోలీసువారి పనులలో అనవసర జోక్యంకలిగించుకొన్నానా?'

'పాతముద్దాయి, గాలీస్లేవ్ (Galley Slave—ఓడబానిస)" అని.

మేడలేన్ ముఖాన్న నెత్తురుచుక్కలేదు. కనులు పైకెత్తని జావర్టు ఆవిషయం గమనించలేదు.

" మీరు గాలీస్లేవ్ అనుకొన్నాను. కొన్నాళ్ళ బట్టి అనుకొంటూవచ్చాను. కొంతపోలిక, ఫావరోల్స్‌లో మీరు చేసిన వాకబు, మీనడుంబలం, షాపివిలెంటు ఇతిహాసం, మీతుపాకిగురి, మీ నడక, వీటి అన్నిటిని బట్టి. అసంభవమే! కాని మీరు జీన్‌వాల్జియనన్న ఓడబానిస అనుకొన్నాను"

'ఏం పేరు?'

'జీన్ వాల్జియర్. అతను కాన్విక్టు. ఇరవైఏళ్ళక్రితం టూలన్,
'అసిస్టెంటు జైలర్‌గా నేనున్నప్పుడు వాడక్కడ ఖైదీ.
గాలీస్, వదిలాక, ఒకబిషప్పును దోచి, ఒకశావాయార్డ్ కుఱ్ఱ
వాడి డబ్బులాగి పారిపోయాడుట. ఎనిమిదేళ్ళబట్టీ దొరకక
లేదు. పైన చెప్పినరీతిగా నేను తమరనుకొని రిపోర్టుచేసాను.
క్రోధానికి దాసుడనై తమ్ము నిందించాను."

మేడలేన్ కొద్దిగా కూడుకొని మామూలుగా అన్నట్లుగా
'పైవాళ్ళేమన్నారు?' అన్నాడు.

"నాకు మతి భ్రమించిందన్నారు."

"ఊఁ!"

"నాదేతప్పు; వాళ్ళదేసరి"

"నువ్వొప్పుకొన్నందుకు సంతోషం"

"ఒప్పుకోకతప్పదు. అసలు జీన్‌వాల్జియర్ దొరికాడు."

మేడలేన్ చేతిలోపుస్తకం నేలమీదపడింది. జావర్టువంక పరీ
క్షగా చూస్తూ, వర్ణింప రానిస్వరంతో—

'ఓహో' అన్నాడు."

జావర్టు తలెత్తకుండా చెప్తున్నాడు.

"ఛాంప్‌మాత్యూఅనేవాడు,ఒకనాడుఒకదొడ్లోయాపుల్‌కొమ్మ
విరిచి పళ్ళుదొంగిలించాడు. ఆకొమ్మ అతని చేతిలోఉండగానే
పట్టుకొన్నారు. ఇంతవరకు చిన్న పోలీసు కేసు మాత్రమే.
అంతే! కాని విధిఅల్లా తోసుకువస్తుంది. జైలు మరమ్మతులో
ఉండబట్టి, ఛాంప్‌మాత్యూని ఆరాస్ (Arras) జైలులో

వేశారు. పాతముద్దాయి, బ్రివెట్ అతన్ని చూడగానే 'అరే! జీన్ వాల్జియన్ ఇల్లాచూడ'మన్నాడు. అతను అమాయకత్వం నటిస్తూ నాపేరు ఛాంప్‌మాథ్యూ. జీన్‌వాల్జియ నెవలో నాకు తెలియ'దన్నాడు. ఆరాలు తీయగా పేరుమార్చినట్లు తోచింది. నాకోసంకబురుపంపారు."

" ఊఁ! "

' మేయరుగారూ! నిజము, నిజమే. నేను న్యూనతపడ్డాను, గాని ఆవ్యక్తి జీన్‌వాల్జియనే. నేనుకూడా గుర్తుపట్టాను.' మేడలేని హీనస్వరంతో—

' బాగా నిశ్చయమేనా?' అన్నాడు.

నమ్మక తప్పక వచ్చినవాడిలాగా ఒకవిషాదపు నవ్వునవ్వి, జావర్ట్ " ఆ! నిశ్చయమే "అన్నాడు.

జావర్టు అల్లా పరాకుగా నిలుచుని కలండార్‌లో వేళ్ళు త్రిప్పుతూ కొంతసేపాగి

" అసలైన జీన్‌వాల్జియన్ వేరేఉండగా, నేనిన్నాళ్లుగా ఇతరత్రా ఎల్లానమ్మానో తెలియకుండాఉంది. మేయరుగారూ! మీకుమాభిక్ష వేడుకొంటున్నాను."

ఆరువారాలకిత్రితం, తన్ను తన ఆఫీసులోనుంచి, హీనాతిహీనంగా వెడలనడిపించిన వ్యక్తిని, క్షమార్పణ కోరుకొంటూంటే, ఈ రోషమూర్తి జావర్టు అప్రియత్నంగా, తనకు తెలియకుండా, గాంభీర్యంతో, గౌరవప్రదమైన నిరాడంబరత్వంతో, స్ఫురించాడు.

విషయం తప్పించి మేడలేన్ «ఆమనిషే మంచిగాడు ?» అని అడిగాడు.

«అదంతా ఒకగొడవ. ఎన్నిచెప్పినా, ఎన్నిఅడిగినా, ఎల్లా అడిగినా, అతనునాపేరు ఛాంప్‌మాత్యూ, జీన్‌వాల్జియన్ కాదంటాడు. ఇదేమీ అర్థంకానట్టు నటిస్తాడు. కాని జీన్ వాల్జియన్ చాలా తెలివైనవాడు. అందుచే ఎల్లాఅన్నా నటించ గలడు. ఎర్రాస్ ఏసేజెస్ (Arras, Assizes)లో విచారణ. నన్నూ సాక్ష్యానికి పిలిచారు.»

మేడలేన్ మళ్ళీ బల్లవంకతిరిగి ఒకపుస్తకం పేజీలు తిరగేస్తున్నాడు.

«జావర్టు! చాలు. ఆవిషయాలు నాకెందుకు, కాలహరణం. సరే నువ్వుపోయి, బుసాపైడమ్మ సందుమలుపులో కూరలమ్మేవాడి బాడిసామిపెట్టె మీద సమన్సుపెట్టమని చెప్పు. వాడుకట్టుపొగరుబోతు. ఆఅమ్మా, పిల్లాకూడా బండికిందపడి చచ్చేందుకు సిద్ధమయ్యారు. అక్కడ్నించి ఛార్సిల్లె దగ్గిరకువెళ్ళి— కానిచాలా పనులు చెబుతూన్నట్టున్నాను. నీవు ఎర్రాస్ (Arras) ఎప్పుడెళ్ళాలన్నావు ?»

"రేపురాత్రికి విచారణ ఒకరోజంతా పట్టవచ్చు. నాసాక్ష్యం ముగియగానే రేపు రాత్రి నేను వచ్చేస్తాను.

"సరే వెళ్ళిరా" అని చెయ్యి ఊపాడు.

జావర్ట్ కదల్లేదు.

"మేయరుగారూ ! ఒకమనవి"

"ఇంకా ఏమిటి ?"

"నేను వచ్చినపని మరచిపోయాను. నన్ను డిస్‌మిస్ చేయాలి" మేడలేన్ నుల్చున్నాడు—

"జావర్టు ! నువ్వు సత్యపురుషుడివి. నువ్వంటే నాకు గౌరవం హెచ్చు. గోరంతలు కొండంత చేస్తున్నావు. కాకుండా ఇది నా విషయం. జావర్టు, నువ్వు పైకిరావలసినవాడవుగాని, క్రింది దికి పోతగవు. నీ ఉద్యోగంలో నువ్వుండ వలసిందిగా నా కోరిక." జావర్ట్ వెలుగుతూన్న కండ్లతో మేడలేన్ వంక చూశాడు. కొంతఅజ్ఞానమయమైనా, ఏకైక లక్షితమూ, శుచి పూర్ణమూ, అయిన అతని అంతరాత్మ అతని కన్నులలో వెలిగిపోతూంది.

"మేయరుగారూ ! నే నొప్పుకోను అల్లావీలులేదు."

"ఇది నాస్వవిషయమని మళ్ళీ చెబుతున్నాను."

కాని జావర్టు పైమాటలు వినిపించుకోకుండా, తనమనస్సుకే సమాధానం గట్టిగా చెప్పుకొంటూన్న వాని లా చెప్ప సాగాడు.

"నేను గోరంతలు, కొండంతలు చేయటం లేదు. నా హేతు క్రమము అది. నేను అన్యాయంగా మిమ్మల్ని అనుమానించాను. అది పెద్దదోషంకాదు. నాకన్న పైవార్ని అనుమానించటం కొంత తప్పైనా, అనుమానించటం, నా ఉద్యోగ ధర్మం, విధి. కాని, ఋజువులు లేకుండా, కోపంతో. కక్షసాధించటానికి, మేయరుగారు, మేజస్ట్రేటుగారు, గౌరవనీయులు

అయిన మిమ్మనుమానించి మీపై నేరం ఆరోపించాను. ఇది చాలా అపరాధం. ప్రభుత్వపు నౌకరైన నేను, మీరూపిత మైన, ఆ ప్రభుత్వాన్ని నిందించాను. ఈ కృత్యమే నాకిం దివాళ్ళెవళ్ళైనా చేసిఉంటే, నేనువాళ్ళని నౌకరీకి పనికిరారని తక్షణమే డిస్‌ఛార్జిచేసి ఉందును.

ఆగండి మేయరుగారూ ! ఒకమాట.

నాజీవితంలో నే నింతవరకూ ఇతరులయెడ చాలా తీవ్రంగా ప్రవర్తించాను. నాయెడ ఆ తీవ్రత నేను కనబరచలేకపోతే ఇన్నాళ్ళుగా నేనొనర్చినన్యాయమంతా అన్యాయమైపో తుంది. నా ఋజువర్తనమంతా అధర్మవర్తనమయి పోతుంది. ఇతరులయెడ తీవ్రత; నాయెడ అలసతయునా ! ఏం ! జావర్టు న్యాయం. ఇతరులని శిక్షించటానికే గాని తన విషయంలో కాదేమో !

మేయరుగారూ ! నాకు దయచూపవద్దు. మీ దయ మూలాన్నే నారక్తం ఒకసారి ఉడుకెత్తింది. ఏదయ, దుష్టులను శిష్టులనుండి రక్షిస్తుందో, ఆదయ చెడ్డది. సంఘానికి విప క్రిమి, ప్రభూ ! మంచిగా ఉండటం తేలికే, న్యాయంగా ఉండటం కష్టం. నేననుకొన్న వ్యక్తే మీరయి ఉన్నట్లయితే నేను మిమ్మ కరుణించే వాడినికాను. మేయరుగారూ ఇతరుల యెడ ఎల్లాప్రవర్తించానో, నాఎడ అల్లాగే చరించటం నావిధి అయి ఉంది.

దురాచారులని పట్టుకొనేటప్పుడను కొనేవాణ్ణి. “ జావర్టు జాగ్రత్త! ఏనాడైనా ధర్మపధం తప్పుతావేమో ” అని. నేడు

అధర్మవర్తినయ్యాను. శిక్షపొందక తప్పదు. నాచేతుల్లో బలం ఉంది. బ్రతుకు తెరువు చూచుకోలేక పోలేను. మేయరు గారూ, ఇన్స్పెక్టరు జావర్టుని ఉద్యోగంలోనించి తొలగించ మని వేడుతున్నాను.

వినయంతో, సగర్వంగా, నిరాశతో, సంపూర్ణ నిశ్చయంతో పలికిన, ఈ పలుకులు, ఈ విపరీత ధర్మాచరణున కొకవింత మహాత్మ్యం అనుభూటించాయి. "సరే, తరువాత చూద్దాం" 'అని మేడలేన్ అతనితో కరచాలనమునకు ముందుకు చేయి చాపాడు.

జావర్ట్ ఛలాలున ఒక అంగ వెనక్కు తగ్గి, కఠినంగా "క్షమించండి, మేయరుగారిచేయి గూఢచారి స్పర్శించరాదు" అని పంక్తు కరిచి

"అంతే! ఏనాడు నేను నా అధికారం దుర్వినియోగం చేశానో, ఆనాటినుంచీ నేను గూఢచారిని మాత్రమే"

అని తలవంచి వెనుకకు తిరిగి తలుపు దాకాపోయి, నేల చూస్తూ—

"మేయరుగారూ, ఇంకో ఇన్స్పెక్టరువచ్చేదాకా నే ఫ్యాక్టరీ లోనే ఉంటాను" అని వెళ్ళిపోయాడు.

అతని పదధ్వనులు వింటూ మేడలేన్ దీర్ఘాలోచనలో మునిగి పోయాడు.

# ౧౦ వ పరిచ్ఛేదము

కచ్చేరీ పనులుముగించుకొని మేడలేన్ సరాసరి ఫాంటైన్ దగ్గరకు వెళ్ళాడు. ఫాంటైన్ అతనిరాకకోసం రోజంతా కాసుకునుండేది. అతనుదగ్గరున్న కాసేపు చాలాఆనందం అనుభవించేది. ఆమెకుసేవ చేస్తూన్న సిస్టరుకుకూడా ఫాంటైన్అంటే జాలీ, ప్రేమా కలిగాయి. ఆవేళ ఫాంటైనుకు కొంత జ్వరం ఎక్కువైంది. మేడలేన్రాగానే ఫాంటైన్ 'కాసెట్టీవదీ!' అని అడిగింది. చిరునవ్వుతో అతను "వస్తూందమ్మా" అని సమాధానపరిచాడు. రోజూకన్న అతను కాసేపు ఎక్కువగా ఆమె దగ్గిరకూర్చున్నాడు. వైద్యుడు ఆమె విషయం పెదవివిరిచి కృంగిపోతోందన్నప్పుడు ఆమె పరోక్షాన అతనిముఖము విచన్నమైంది.

సరాసరి ఇంటికిపోకుండా అతను బళ్ళఆసామి స్కాఫ్లార్ దగ్గిరకుపోయి బాగాపోయే ఒకగుర్రపుబండికి అదే అద్దెన్ను

ఇచ్చి బండి, గుర్రం ఖరీదు అతనిదగ్గిర హామీపెట్టి తెల్లవారే సరికి బండి తనవాకిట వుండేటట్టుగా నియమించి ఇంటికి వచ్చాడు. సరాసరి ఇంటికివచ్చి మేడమీద తనపడకగదిలోకి పోయి గదితలుపులోన గడియవైచాడు. క్రిందగదిలో పరా బుకు అర్థరాత్రిదాటాకకూడా పైగదిలో యెవరో ఇటు అటు నడుస్తూన్న శబ్దం వినబడుతూనూనేఉంది.

2

మళ్ళీ ఒకసారి జీన్ వాల్జియన్ ఆత్మకేసి తొంగిచూడాల్సిన అవుసరం వచ్చింది. ఉద్రేకం లేకుండా చూడడం కష్టం యెందుకంటే అల్లాంటి మనః ప్రవృత్తికి మించిన భీభత్స దృశ్యం వుండదు.

మనోనేత్రం, మానవునిలోకన్నా అఖండ తేజాన్ని, గాఢాంధకారాన్ని ఇంకెక్కడా కాంచలేదు. అంతకుమించి నిగూఢము, మహత్తరము, అనంతమైనవిషయాన్ని మరి దేన్నీ పరిశీలించ లేదు. సముద్రంకన్నా గంభీరమైన దృశ్యమున్నది; ఆకాశం. ఆకాశంకన్న గంభీరమైన దృశ్యముంది; మానవాత్మ. ఆత్మ గీతం పాడదలచుకొంటే, ఏ ఒక్క మానవునిదైనాసరే— అతడు నీచాతినీచుడైనాసరే- సర్వపురాణసార సంగ్రహమూ, ఒక మహాగీతిగా నిలచి పోతుంది.

చినజెర్వే పారిపోయిన నాటినుంచి జీన్ వాల్జియన్ మారి పోయాడు. బిషప్పు తన్ను ఏవ్యక్తిగా చేయదలచుకొన్నాడో ఆ వ్యక్తిగా అయిపోయి వర్తించాడు. అది కేవలం ఒకమార్పే కాదు. ఒకపునర్జన్మ. బిషప్పిచ్చిన వెండి పళ్ళెం అమ్మేసి

సెమ్మాలు రెండూ స్మారకచిహ్నాలుగా మిగుల్చుకొని మ—పురం చేరాడు. తన వ్యక్తిత్వము పూర్తిగా మాయం చేసుకొని కొత్తమనిషిగాఅయి క్కడ తన పూర్వార్థ జీవితానికంతకూ ప్రాయశ్చిత్తపూర్వకమైన నూతన జీవితాన్ని ప్రశాంతంగా గడుపుకొంటూ వచ్చాడు. తన మునుపటి పేరు దాచేసికొని తన జీవితాన్ని పవిత్రం చేసుకొంటూ మానవమధ్యాన్నుంచి దైవ సాన్నిధ్యం చేరాలనే భావాలతో అతనిమనసు నిండిపోయింది. సామాన్యంగా ఈ రెండు భావాలు సమన్వయంగా నడుస్తూ అతని జీవితాన్ని శాంతంగా గడిపేవి. కాని ఒక్కొక్కప్పుడు ఈ రెండూ సంఘర్షణలోకి వచ్చేటప్పటికి రెండవ భావానికి మొదటిది బలైపోయేది. అలాంటప్పుడు తన పేరు బయల్పడు తుందన్న భయం అతన్నడ్డేదికాదు. అలాంటప్పుడల్లా తన స్వార్థాన్ని పరసేవముందు త్రొక్కేసుకొనేవాడు.

అయినా ఇంతకుముందెప్పుడూ ఈ రెండు భావాలకు ఇంత విపరీత సంఘర్షణరాలేదు. జావర్ట్ మాట మొదలెట్టగానే ఏదో ఒక మేఘం ముంచుకొస్తున్నట్టుగా అతని కనిపించింది. తను ఇంతగా దాచేసిన ఆ పేరు జావర్ట్ నోట పలికేటప్పటికి తనవిధి వైపరీత్యానికి పిడుగుదెబ్బ తిన్నట్టుగా అచేతనుడై పోయాడు. ముంచుకొనివస్తున్న తుఫానుకు తలఒగ్గేమహా వృక్షంలాగా వంగిపోయాడు. ఆ మబ్బులోనుంచి ఉరుములు మెరుములు తన నెత్తిమీదకు కూడుకొంటున్నట్టుగా అనిపించింది. జావర్ట్ మాటలు వింటూన్నప్పుడు వెంటనే పరుగెత్తి పోయి సభామధ్యంలో జీన్ వాల్జియన్నని ఒప్పేసుకొని ఛాంప్ మాథ్యూని జైలునుండి విడిపించి ఆస్థానమాక్రమించుకొందా

మని ఉద్దేశ్యం కలిగింది. కాని ఆ ఉద్దేశ్యాన్ని అల్లాగే ఆణి చేసుకోగలిగాడు. నిజంగా అతను వెంటనే అల్లాచేస్తే మహత్తరంగా ఉండేదేమో! బిషప్పు మాటలనాటినుండీ తన సద్ధర్మం నుంచి ఒకనిముసమైనా అతను తొలగిపోలేదని చెప్పుకోగలిగితే చాలా ఉత్తమంగా ఉండేదే! కాని జరిగిన విషయాలు జరిగినట్టుగా చెప్పవలసిఉంది. ఆ భావాలన్నిటినీ అతను తొక్కేసుకొన్నాడు. అతని మనస్సులో ఒక పెద్దతుపాను రేగిపోతోంది. బైటికి మాత్రం అతిప్రశాంతంగా అతను నడుస్తున్నాడు. రోజంతా అతని మనస్సులో తుపాను రేగుతోనేవుంది. కాని సత్కృత్యాలు అతినెమ్మదిగా చేస్తున్నాడు. ఈ విషయంలో ఎల్లాప్రవర్తించాలో అతనికి అగమ్యగోచరంగా ఉంది. అర్రాస్‌కు పోయి న్యాయస్థానంలో ఈ విచారణ చూడటంలో ఏమీ హానిలేదన్నట్టుగా అనుకొని బండిమాట్లాడాడు.

పూరా ఆకలితో శుభ్రంగా భుజించికూర్చుని ఆలోచించాడు. ఈ సంఘటన మహావిపరీతంగా అతనిమనస్సుకు గోచరించింది. యేదో తెలియని ఆవేదనతో భయంతో తలుపులోపల గడియవైచాడు. ఎవరో లోపలికి వస్తారన్నభయమేసినట్టుగా. దీపం చిరాకెత్తించింది. దీపమార్పేశాడు. ఆ చీకట్లో చేతుల్లో తల పట్టుకొని ఆలోచిస్తున్నాడు.

నేనెక్కడున్నాను? ఇదికలగాదా? నే విన్నదేమిటి? నిజంగా జావర్టు నాతో ఈ మాటలన్నాడా? ఈ ఛాంప్ మాథ్యూ యెవరు? నాలాగున్నాడట. ఇది సంభవమా? నిన్న ఈ పా

టికి ఏచీకూ చింతలేక శాంతంగా ఉన్నానే. దీనిఫలితమేమిటి నేనేం చెయ్యాలి ? ”

ఇల్లా ఒకభావంవెంట ఒక భావం, అందకుండా, నిలవకుండా, బుర్రలో పరుగెత్తుతున్నాయి. దేనికీస్థాయి చిక్కటంలేదు. తల వేడెత్తిపోయి కాలిపోతున్నట్లుగా ఉంది. కిటికీదగ్గరకు పోయి కిటికీ తెరిచాడు. బైటనక్షత్రాలులేవు. మళ్ళీవచ్చి బల్ల దగ్గిర కూర్చున్నాడు. ఒకగంట అల్లాగడిచిపోయింది. అతని భావాలలో అనవగాహనంగా కొంతస్థాయి చిక్కుతూన్నట్లుగా అని పించింది. తను యెంత విపరీత విషమ పరిస్థితుల్లో ఉన్నా, కర్తృత్వము తన చేతుల్లోనే ఉన్నట్టతని కనిపించింది. జైలులో తన పూర్వవ్యక్తిత్వ స్థానానికేర్పడిన కాళీలోకి, విధి ఇంకో తనలాంటి వాడిని తోసేస్తోంది. ఆకాళీ మాత్రం పూర్తి అవాలి. ఈ పరిస్థితుల్లో తను చేయవలసిన దేమీలేదు ఊరికే ఉంటేచాలు. మళ్ళీదీపం వెలిగించాడు.

“నేను దేనికి భయపడ్డాను. నా పాతచరిత్రం బైలువడే దోవ దానంతటదే మూసుకుపోయింది. నన్నుపసిగట్టిన జావర్టు కింకో జీన్‌వాల్జియర్ దొరికాడు. పసితప్పేదు. నాజోక్యం లేకుండానే ఈ పనులన్నీ సాగిపోయాయి. యెవరో దుఃఖం అనుభవించాల్సొస్తే దానికి నా ఇదేముంది? దైవం చేస్తూన్న పనులు ప్రతిఘటించడానికి నే నెవరిని. ఉహు ! ఇంకీ విషయం నే నాలోచించను. ” అనుకొంటూ లేచి పచారు చేయటం మొదలు పెట్టాడు. కాని సంతోషం చిక్కలేదు. సముద్రతరం గాలను ఒడ్డుకు రాకుండా ఆపటం ఎంత తేలికో, మనస్సును

ఒక భావంచుట్టూ పరిభ్రమించకుండా చేయటం అంతే తేలిక. భగవంతు డాత్మను సముద్రంలాగే రేగించేస్తాడు. మళ్ళీ తుపాను రేగింది.

పేరు దాచెయ్యటమా! పోలీసులను మోసపుచ్చటమా? ఈ కాస్తకేనా ఇంత పవిత్ర జీవనం గడిపింది! తన వ్యక్తిత్వాన్ని కాకుండా ఆత్మను రక్షించుకోవాలనే ఉన్నతాశయంతో కాదా ఇన్నాళ్ళు గడిపింది! బిషప్పు చెప్పింది అదే కాదా! పాత జీవితం తలుపులు మూసెయ్యటమా! దైవమా మళ్ళీ మునుపటికంటె నీచమైన బందిపోటు దొంగతనమా! ఇంకో వ్యక్తి జీవితాన్ని, స్వేచ్ఛను, ఆనందాన్ని, దొంగిలించేయటమేనా! ఆ జీవిని ఈ భూలోక నరకంనుంచి తప్పించాలి. కాని తను ఏనరకంనుంచి తప్పించుకొచ్చాడో మళ్ళీ ఆనరకంలో పడాలి. ఈ జీవితమంతా వృధాఐపోతుంది. ఈ కీర్తి మాసిపోతుంది. అతని కక్కడ బిషప్పు నిల్చున్నట్లుగా అనిపించింది. ఆ బిషప్పు దృష్టిలో, ఆ మెడలీను కంటె ఈ జీన్ వాల్జియనే ఉత్తముడుగా కనపడుతున్నాడు. ఈ పనిచెయ్యక తప్పదు. అబ్బా! తన విధియింత విపరీతమా! మానవదృష్టిలో నీచుడు కాందే, దైవదృష్టిలో ఉత్తముడు కాలేడా?

'సరే, వెళ్ళి నాధర్మంనిర్వర్తించి అతన్ని వదిలిస్తాను' అనుకున్నాడు.

అల్లా ఒకనిశ్చయాని కొచ్చాననుకొనికొంతసేపు గడిపాడు. ఇం

తలో చటుక్కున షాంపైన్ జ్ఞాపకం వచ్చింది. మళ్ళీఒకక్షణం సంగ్రామం.

ఇంతసేపూ తన్ను గురించే ఆలోచించుకొన్నాడు తప్పఇతర చింతన లేదు. ఇదంతావివిధరూపాల్లో "స్వార్థం" మాత్రమే. తను ఇక్కడినుంచిపోతే ఈ పురం సంగతేమిటి, ఈ ఫ్యాక్టరీలు వర్తకం, జనం, బీదా, బిక్కి, బిక్షలు అంతాఏమయిపోతారు? ఆ స్త్రీ యేమయిపోతుంది. తనుపోతే ఈ ఊరికి అత్మపోయి నష్టంగాదా ? ఈ ఛాంప్‌మాథ్యూకోసం వీళ్ళందర్నీ బలియ్యటమేనా. ఛాంప్‌మాథ్యూ కేవలం ఒక నీచుడే; తన్ను తను జైలుపెట్టుకోవడం కేవలంస్వార్థచింతనా,పిచ్చితలపూ మాత్రమేకాదా!



ఇంతవరకూవిధి తన జోక్యం లేకుండా నడుపుకొంటూవచ్చింది. ఇప్పుడు తను ఇందాక అనుకున్నట్లుగాచేయటం కేవలంతప్పు. తన ఒక్కడి ఆత్మకోసం, పొరుగువాళ్ళనందర్నీ నరకంలోకి తోసెయ్యటం. కాబట్టి తన్ను జైలుపెట్టుకోకూడదు.

ఇల్లాఅనుకొనిఅతను అమ్మయ్యా! అనుకొన్నాడు. జీన్‌వాల్జియన్‌నుగుర్తుతెచ్చేవన్నీ తగలెయ్యాలనుకొన్నాడు.ఇన్నాళ్ళూ భద్రంగా దాచిన వస్తువులుకొన్ని బయటకు తీశాడు. 1815 నాటి జీన్‌వాల్జియన్ పాతదుస్తులు, బిషప్పు సెమ్మాలు, చిని జెర్వేనాణెం. ఇవన్నీ తీసినిప్పులో వేసికాల్చేశాడు. దాంతో జీన్‌వాల్జియన్‌ను పూర్తిగా నాశనం చేసాననుకొన్నాడు.

ఇంతలో అతని లోపలనుంచి జీన్‌వాల్జియన్ ! జీన్‌వాల్జియన్

అని ఒక కేకవినపడ్డట్టయింది. ఒళ్ళుగగుర్పొడిచి, వింటూాన్నట్టు గాఅగాడు.

"అల్లాగే చెయ్యి, అదేపద్ధతి. సెమ్మేలు కాల్చేసేయి, విపప్పు సుమరిచిపో. అన్నీ మరిచిపో! ఛాంప్‌మాంథ్యూని నాశనంచెయ్యి. నీపేరుబరువుతో వాడుకుంగిపోయి, నరకం అనుభవించనీ; నువ్వుమాత్రం సత్పురుషుడవుగా ఉండిపో. ఇక్కడ మేయరుగాఉండి గౌరవంగా, సుఖంగా, నలుగురి పొగడ్తలూ అందుకొంటూాకూర్చో!అక్కడ నీస్థానంలో వాడుమగ్గిపోతాడు.బలేవీలు. అరి దుర్మార్గుడా !"

అతనివళ్లు ముచ్చెమటలు పోశాయి. ఆఅంతరాత్మ ఆగలేదు. "జీన్ వాల్జియన్ ! నిన్ను పొగడుతూ అనేకకంఠాలు అల్లరిగా పలుకుతూ ఆశీర్వదిస్తుంటాయి. ఒక్కకంఠం మాత్రం చీకట్లో ఎవళ్ళకీ వినపడకుండా తిట్టుకొంటూావుంటుంది. అభాజనుడా! విను. ఆకంఠాలన్నీ స్వర్గానికి పాకే లోపలే క్రిందపడి పోతాయి. ఈ ఒక్కకంఠమే దైవం దగ్గరకు వెళ్తుంది."

ఆ అంతరాత్మ నాదంతో గది అంతా నిండిపోయింది. తనకంఠం కాదనుకొని గట్టిగా "ఇక్కడెవరైనా ఉన్నారా" అని అరిచి, విపరీతంగానవ్వి"అయ్యో మూర్ఖత్వమా! ఎవళ్ళున్నారు' అనుకున్నాడు.

కాని ఆవేళ అంతరాత్మ ఆ గది అంతానిండిపోయింది. మళ్ళీ అతనిమనసును కెలికేసింది. మళ్ళీసముద్రంలాగ అతనిమనసు

రేగిపోయింది. అల్లా ఆ రాత్రంతా ఆ ఆత్మతో యుద్ధం చేశాడు. స్కాఫ్లార్ బాడిరావటంతో తెలివి తెచ్చుకొని అతను ప్రయాణం బయలుదేరాడు.

3

మర్నాడు తెల్లారగట్ల అట్లాస్‌నుంచి వస్తూన్న టపాబండీకి మ-పురం దగ్గిరగా ఒకచిన్న బగ్గీబండుకు తగిలి చక్రాలు కొట్టుకొన్నాయి. బగ్గీతోలుకొంటూన్న మనిషి. తలెత్తకుండా తోలుకొంటూ పోతున్నాడు. టపాబండీ అబ్బాయి వెనక్కి వేసిన కేక అతనికి వినబడలేదు.

మేడలేన్ తలెత్తకుండా దీర్ఘాలోచనలో మునిగిపోయి అల్లాగే పోతున్నాడు. చివరికి ఒక చిన్నపల్లె దగ్గరకొచ్చేటప్పటికి గుఱ్ఱం అలిసిపోతే సత్రందగ్గరకొచ్చి ఆకలితో ఆగాడు. అక్కడ తిండి సహించలేదు. మళ్ళీ గుఱ్ఱానికి దాణా పెట్టిన మనిషి బండి చూసి, అతనితో ఈ బండి ఇంకకదలవన్నాడు. చూడగా బండిఇరుసు విరిగిపోయిఉంది. అక్కడ బండీ బాగుచేసేవాడు లేడు. ఇంకో బండి దొరకదు. ఒక రోజు ఆగితేగాని బండిబాగు చేసేందుకు వీలులేదు. అతనొక్కనిశ్వాసం వదిలాడు. మనసు కొంత తేలిక పడ్డది. ఇంతలో ఒక వృద్ధురాలు అక్కడికొచ్చి తనబండీ అద్దెకిస్తానని చెప్పింది. అల్లా విధి మళ్ళీ తోసుకొచ్చింది. తను అంతకుముందు పడ్డఅల్పసంతోషానికతను చీదరించుకొన్నాడు. తన్నెవరూ ఇల్లా చెయ్యమనలేదే! తనంతచేసు

కొన్నదేగాదా. మనస్సు కుదురుచేసుకొని మళ్ళీ బయలుదేరాడు. ఆ ముసలమ్మ ఈనాం అడిగింది. ఆతను విసుక్కుంటూ వెళ్ళిపోయాడు. అడగకుండా వేలకువేలు గుప్పెసిన అతనికి ఆ ముసలమ్మ ఈనాం అడగటం దౌష్ట్యమనిపించింది.
ప్రకృతిదృశ్యాలన్నీ తుదిసారిలాగా అతనిముందునుంచి వెనక్కుపోతున్నాయి. పొగమంచు కప్పేస్తోంది. చీకటి పడింది. అర్రాస్ చేరేటప్పటికి రాత్రి ఎనిమిదిగంటలయింది. ఎనిమిది గంటలకే కోర్టుపూర్తి అయిందేమో. కోర్టువాకిటనిలిచి తటపటాయించి లోపలకు పోయాడు.

4

ఛాంప్ మాథ్యూవిచారణ జరుగుతూంటే జడ్జీగారివద్దకు నౌకరు ఒక చీటీతీసుకొని వచ్చాడు. వారినిలోపలికితీసికొనిరమ్మనికబురు చేసి, జడ్జీతనపనిలో నిమగ్నుడయాడు. మేడలేన్ లోపలికివచ్చి ఆపక్కకుర్చీలో కూర్చున్నాడు. తనపనిలో మునిగివుండే జడ్జీ, ప్రాసిక్యూటర్ మొదలైనవారుతనికి తమస్వాగతాలిచ్చారు. అంతకుమించి ఎవరూతన వంకచూడలేదు. ఇదంతా ఒకమాయగా కళ్ళముందర జరుగుతూంది. తనపాత జీవితమంతా ఉబ్బెత్తుగా బైటబడి తనకళ్ళముందర నడుస్తూంది. వీళ్ళంతా నిజమైన మనుష్యులే, ఇదంతానిజమే. మునుపటిలాగే అదే వేళ, అదేమనుష్యులు, అదేపద్ధతి, జావర్టుకోసం చూశాడు. జావర్టు కనపడటంలేదు.
చాంప్ మాథ్యూ విచారణ తీవ్రంగాసాగిపోతోంది. అంతకంతకూ అతను జీన్ వాల్జియన్ అన్నవాదంబలపడిపోతూంది. ఇందరు విజ్ఞానమూర్తులు తన్ను జీన్ వాల్జియన్ అనిచెప్పి,

నేరారోపణం చేస్తోంటే, ఆ అజ్ఞాని ఆశ్చర్యంతో చూస్తు న్నాడు. అతని అమాయకత్వం అంతా నటన లాగా, అతి తెలివి తేటల లాగా అర్థం చేసుకో బడ్డది. అతని పక్షపు ప్లీడరుకే అతనిలో నమ్మకం కలుగలేదు. బ్రివెట్, ఛెనెల్డూ కోషిపెల్లీ, ముగ్గురు దొంగలూ సాక్ష్యానికొచ్చి అతన్ని గుర్తిం చారు. అతను మూఢుడులాగు చూస్తూ జనమంతా నవ్వీన ప్పుడు తనూ నవ్వుతూ నిలబడ్డాడు. జడ్జీ ఇంక చాలిద్దామను కొని అతను జీన్ వాల్జియన్ అన్న పూరా నమ్మకంతో శిక్ష వేసేందుకు సిద్ధంగా ఉన్నాడు.

అప్పుడు ప్రెసిడెంట్ పక్కనుండి ఒకకంఠం వినబడింది. "బ్రె వెట్ ఛెనిల్డూ, కోషిపెల్లీ!! ఇటుచూడండి" ఆ కంఠంలో ఉన్న విషాదగాంభీర్యాలు ప్రజలనొక్కసారి జల్లుమనిపించాయి.

అంతవరకు వేళాకోళాలతో వెకిలింతలతో గడుస్తూన్నసభ ఒక్కసారిగా నిశ్శబ్దమైంది. ప్రజలంతా ఈ మహిమాదృ శ్యం చూస్తున్నారు.

మేడలేన్ ముందుకువచ్చి బ్రివెట్, ఛెనెల్డూ, కోషిపెల్లీలవద్ద కు నడిచి 'నన్ను గుర్తించలేరా' అనిఅన్నాడు.

వాళ్ళుముగ్గురూ తెల్లపోయారు.

" న్యాయాధిపతులారా! ఆ ఛాంప్ మాథ్యూని వదిలెయ్యండి. అసలైన జీన్ వాల్జియనును నేను. అతను కాదు."

ఒక్కఘ్యాడూపిరి వదలటంలేదు.

ఒక మహిమనూ దృశ్యాన్ని చూస్తున్నవిభ్రమంతో జనం నిశ్శబ్దంగా ఐపోయారు.

పబ్లిక్ ప్రాసిక్యూటరు తెలివితెచ్చుకొని 'ఇక్కడెవరైనా వైద్యులున్నారా' అని అడిగాడు. మేడలేన్ విషాదంగా నవ్వి అన్నాడు. " అయ్యా! కృతజ్ఞుడను. కాని నాకు మతిభ్రమించలేదు. నేను నాధర్మం నిర్వర్తిస్తున్నాను. నేను జీనువాల్జియన్ని. అతన్ని వదిలేయండి. నా పేరు దాచేసుకొని మేడలేన్ అనేపేరుతో పవిత్రజీవితం గౌరవంగా గడుపుకొందామనుకొన్నాను. కాని అది అసంభవమని తోస్తోంది. బిషప్పుని, చినజేర్వేనీ నేను దోచినమాట నిజమే, జీన్ వాల్జియన్ భయంకరుడన్నమాట నిజమే, అల్లాంటి నేను సంఘానికి సలహా ఇయ్యటానికి తగనుగాని, నేను ఏ నరకంలోనుంచి బైలుపడదామని అనుకొన్నానో ఆనరకం మాత్రం, చాలా నైచ్యమైనదనీ, హానికరమనీ మాత్రం చెప్పగలను. జైలు మనుష్యులను రాక్షసుల జేస్తుందని జ్ఞప్తికుంచుకోండి.

ఇంక అ మనిషిని వదిలేయండి. మాయింటిదగ్గిర పొయ్యిబూడిదలో చినజెర్వే నాణెందొరకుతోంది. ఏమిటీ! ఎవరూనన్ను నమ్మడంలేదా! హరహరా! జావర్టుంటే బాగుండునే? నన్ను గుర్తుపట్టేవాడే."

అతనివాక్కులోని కరుణా, విషాదశాంత గాంభీర్యాలు వర్ణించటానికలవిగాదు దొంగలవంకతిరిగి.

'బ్రివెట్ ఇలాచూడు! నువ్వు గాలీస్‌లో గళ్ళబేరిసు వేసుకునే వాడవు కాదా !" బ్రివెట్ అదిరిపడ్డాడు. "ఛెనాల్డూ!

నీవీపుమీద T.F.P. అన్న అక్షరాలు మాపేసేందుకు ఒక నాడు నిప్పుదగ్గిర కాల్చుకొన్నమచ్చ ఇంకా వీపుమీద ఉంది కదా?" షెనాల్డ్యూ నిజంఅని ఒప్పుకొన్నాడు. "కోషిపెల్లి నీఎడం చేతిమీద 1815 అన్న అంకెలు పచ్చపొడిచావుగదా? "

ఇవిఋజువుఅవగానే అతను విజయసూచకంగా చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో ఉన్న నిరాశ చూపరులు మరిచిపోలేరు. "చూశారా ! నేను జీన్ వాల్జియన్ని!" అక్కడ జడ్జీలుఉన్నట్లు లేదు. అది కోర్టులాగాలేదు. పబ్లిక్ ప్రాసిక్యూటరుకు తను కేసు పెట్టాలన్న స్పృహేలేదు. ఆ మహిమాదృశ్యం ముందర జనం అంతా అచేతనులైపోయారు.

"సరే మీ కాలం ఇంకా వృథపుచ్చను. నేనెక్కడ దొరుకుతానో మీకు తెలుసునుకదా! " అని అతను సభాభవనం విడిచి వెళ్ళిపోయాడు.

అతన్ని ఎవరూ అడ్డలేదు. కొంతసేపటికి, అందరూ తేరుకొన్నాక, మేడలీన్‌ను అరెస్టు చేయవలసిందని జావర్ట్‌కు హుకుం వెళ్ళింది.

5

షాంపైన్ రాత్రింతా నిద్రలేక జ్వరం బాధతో గడిపింది- మధ్యమధ్య సంతోష స్వప్నాలలో- మేడలేన్ ఊళ్ళోలేరనివిన గానే కాసెట్టికోసమే వెళ్ళాడన్న ఆశతో కొద్దిగా కళవచ్చింది. మేడలేన్ వచ్చేటప్పటికి నిద్రపోతూంది. నిశ్శబ్దంగా ఆమె ప్రక్కనే కూర్చున్నాడు.

కళ్ళు తెరచి అతన్ని చూచి సంపూర్ణవిశ్వాసంతో "కాసెట్టీ ?" అనిఅడిగింది. మేడలేన్ "వస్తుందమ్మా" అన్నాడు. ఫాంటైన్ సంతోషంతో కాసెట్టీ క్షేమ సమాచారాలడుగుతూంది.

అతను చెప్పాల్సినమాట అతనినోట్లోనే ఆగిపోయింది.

ఫాంటైన్ కాసెట్టీని చూపించమని మారాం చేసింది. డాక్టరు వల్లకాదన్నాడు. ఉద్రేకంతో డాక్టరును తిట్టింది. వెంటనే పరితాపపడి క్షమార్పణ కోరుకొంది.

మేడలేన్ ఆమె చెయ్యి తన చేతుల్లో పెట్టుకొని ఉపశమన వాక్యాలు చెప్తూనున్నాడు. దూరాన్న ఒకపిల్లపాటవినబడింది. "అదుగో కాసెట్టీయే" అనుకొని సంతోషించింది. ఇంతలో ఆ పిల్ల వెళ్ళిపోయింది

మేడలేన్ ఆమెవంక చూస్తూ కూర్చున్నాడు. అకస్మాత్తుగా ఆమె ముఖంలో చెప్పరాని భీతివచ్చి, నోటమాటలేక, రక్షణకాగా అతని చెయ్యిగట్టిగా పట్టుకొంది.

మేడలేన్ వెనక్కి చూశాడు.

వికటాట్టహాసంతో జావర్ట్ గుమ్మంలోనిల్చుని ఉన్నాడు. మెడలీన్ ఫాంటైన్‌తో "నీకోసంరా లేదమ్మా" అని, జావర్టుదగ్గరకు వెళ్ళి "జావర్టు! నాకుమూడురోజులు గడువియ్యి. ఈమెకూతుర్ని ఈమె కొప్పగించి నీతో వచ్చేస్తాను" అన్నాడు.

జావర్టుహుంకరించాడు. వీధిముండలు మహారాణుల్లాగా, బందిపోటు దొంగలు మేయర్లులాగా చూడబడటం ఇంకచాలువ

న్నట్టుగా తెలిపాడు. "కాసెట్టేని తీసుకొనిరాలేదా!" అని ఫాం
టైన్ వెనక్కి పడిపోయింది.

మేడలేన్ దగ్గిరకు వెళ్ళాడు. ఆమెలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
లేవు. మేడలేన్ తలవంచి పక్కనే కూర్చున్నాడు. జావర్టు
వచ్చి అతని వీపుమీద చెయివేశాడు.

'ఈ అమ్మాయిని చంపేశావు.'

"చాలునోర్ముయ్యమని కొని రమ్మ"న్నాడు జావర్టు. మేడలేన్ అతని
కేసితీక్షణంగా చూశాడు. జావర్టు అదలిపోయి నాలుగడుగులు
వెనక్కి తగ్గాడు. మేడలేన్ ఆమెప్రక్క మోకరించి ప్రార్థనలో
మునిగాడు. జావర్టు అతన్ని కదలించలేదు.

ప్రార్థన ముగించుకొని మేడలేన్ తన్ను జావర్టు కప్పగించు
కొన్నాడు ......

ఆడూరు మేడలేన్ను మరచిపోయి పూర్వస్థితికి వచ్చింది.

---

రెండవ భాగము

: కాసెట్టీ :

# విక్టర్ హ్యూగో

**1802—1885.**



తండ్రి నెపోలియన్ చక్రవర్తి సైన్యములో సేనాని. తండ్రితో సైన్యాలవెంట హ్యూగో తన బాల్యం గడిపాడు. తరువాత పారిస్‌లో చదువు. ఆరోజుల్లోనే కవితావ్యాసంగంలో కాలం గడిపాడు. మొట్టమొదట ఏలపాటలు వ్రాశాడు. తరువాత క్రామ్వెల్ అనే నాటకంతో, ఆరోజుల్లో నూత్న పంథాలు తొక్కే యువకవులకు నాయకుడయ్యాడు. ఆ నాటినుంచీ ఆస్థానం అల్లాగే నిలుపుకొన్నాడు. అనేకవిధాలుగా సారస్వతంలో కృషి చేసాడు.

ఇతని నవలలో "లామిజరబ్లా" సుప్రసిద్ధము. ప్రపంచసారస్వతంలో ప్రథమశ్రేణికి చెందింది. ఫాంటైన్ ఈ నవలలో ప్రథమభాగము. రెండవభాగం, కాసెట్టి, జీన్‌వాల్జియర్ మారియస్‌లగాథ.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B124 |
| పుస్తకం పేరు | ఫాంటైక్ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 135 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | A. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |